Regd No: M. 1118.

విడిప్రతి 2 అణాలు.



# ఆంధ్రపత్రిక

31 7232

Founder : K. NAGESWARA ROW. SUNDAY EDITION

Vol, 35, ANDHRA PATRIKA, MADRAS. 14th NOVEMBER 1948. No. 221



# సర్వతంత్రస్వతంత్ర రిపబ్లిక్ స్థాపనే భారతదేశలక్ష్యం

## "ఇండియా కామన్వెల్తును వదలి వేయాలి,,

### అమెరికాలోని భారతీయుల సూచన

న్యూఢిల్లీ, నవంబరు 11 : అమెరికాలో ఉంటూ "భారత స్వాతంత్ర్య సాధకై జీవితముల సంకితం చేసిన" 13గురు భారతీయ ప్రముఖులు ఇండియాను "భారత సంయుక్త రాష్ట్రాల స్వతంత్ర ఫెడరల్ రిపబ్లిక్" గా ప్రకటించ వలెనని రాజ్యాంగ పరిషత్తుకు ఒక సూచన చేసిరి.

తమకు బ్రిటిష్ వారిపై శత్రుత్వ భావముండి ఇట్లా చెప్ప లేదని; కామన్వెల్తులో ఉంటేకంటే, ఇవతలకు రావటంవల్లనే, ఇండియా తలిమ్మార్గ అధిని వేశాలతో మర్యాదను, గౌరవమును నిలుపుకో గలదనీ కూడ వారన్నారు.

ఇవతల ఉంటూ ప్రపంచ వ్యవహారాలలో అమెరికా, బ్రిటన్ మున్నగు ప్రజాస్వామ్యాలకే ఇండియా సహాయ పడవలెనని, ఇండియాలో విదేశ పరిపాలనకు చిహ్నంగా ఉన్న ఫ్రెంచి, పోర్చుగీసు ప్రాంతాలను కూడ చర్చల ద్వారానో లేకపోతే వాటిని కొని వేయటం ద్వారానో స్వాధీన పరచుకో వలెనని కూడ వారు సూచించిరి.

### అచ్యుత్ పట్వర్ధన్ విడుదల

నాసిక్, నవంబరు 12 : సోషలిస్టు పార్టీ నాయకుడు అచ్యుత్ పట్వర్ధన్‌గారు నేడు విడుదల చేయబడియున్నారు. వీరితోపాటు బుధవారం రాత్రి సిన్నార్‌లో అరెస్టు చేయబడి ఉపాధ్యాయ, భగయిత్ కార్ అను మరి యిరువురు సోషలిస్టులు కూడ విడుదల చేయబడిరి.

నాసిక్ జిల్లా మేజిస్ట్రేటు వీరివిడుదలకు ఆజ్ఞల నొసంగిరి.



## హైదరాబాద్‌ను భాషాప్రాంతాలుగా విభజించడానికి నెహ్రూ విముఖత

### దక్షిణ భారతవ్యవస్థ తారుమారై పోగలదని ప్రధానామాత్యుని వాదం

న్యూఢిల్లీ, నవంబరు 12: హైదరాబాదుసంస్థానమును మూడు భాషాప్రాంతములుగ విభజించుట గురించి భారతప్రధానామాత్యులు పండిట్ నెహ్రూ నేడుసాయంకాలం పత్రికావిలేఖరుల సమావేశంలో ప్రతికూలాభిప్రాయం ప్రకటించిరి.

ఉత్తరోత్తరా భారతదేశ రాష్ట్రములను పునర్విభజించినప్పుడే హైద్రాబాదు సంగతి కూడా ఆలోచించవచ్చునని పండిట్ నెహ్రూ చెప్పిరి.

అయితే రాష్ట్ర పునర్విభజన ఇప్పుడప్పుడే జరుగదనికూడా వారు స్పష్టంచేసిరి. ఇప్పుడు విభజించుటవల్ల దక్షిణభారత దేశములో కల్లోలము తథ్యమని చెప్పిరి.

భాషాప్రయుక్త విభజన సూత్రమును గురించి వాద ప్రతివాదములలో కలహములు సంభవించుచున్నవే గాని సమస్యలను పరిష్కరించునదిగా ఇప్పుడు లేదనీ, దీనికి హేతువు ఆ సూత్రమునకు అత్యంత ప్రాధాన్యమిచ్చి అనవసరమైనచోటకూడా అమలుజరుపుటకు యత్నించుటేననీ పండిట్ నెహ్రూ చెప్పిరి. ఈ విషయ సమస్యలోనికి హైద్రాబాదునుకూడా చేర్చినచో పరిస్థితి మరింత విషమించగలదనిరి. హేతువాదానికి న్యాయోచితంగా గోచరించినప్పటికీ హైద్రాబాదు విభజన ప్రతిపాదనను ప్రజలు సమ్మతించుట పొరపాటని చెప్పిరి.

భద్రతామండలిలో హైద్రాబాదును గురించిన చర్చ అప్పుడే ముగిసిపోయిందని చెప్పిరి. ఇంక ఈ చర్చ అనవసరమని

(4-వ పేజీ చూడుడు)

## పత్రికా ప్రతినిధుల సభలో నెహ్రూ వివరణ

### పరిషత్ తీర్మానానికి భంగంలేని పద్ధతిలో కామన్వెల్తుతో సంబంధం

న్యూఢిల్లీ, నవంబరు 12 : "కామన్వెల్తు రాజ్యకూటము అనునది ప్రపంచ చరిత్రలో అపూర్వమైనది. సమయానుకూల పరివర్తనకలది. యుద్ధసంకల్పములకు ప్రతికూలమైనది. కాని అనివార్యముగ యుద్ధములో చిక్కుకున్నప్పటికిని అది శాంతిప్రతిష్ఠాపనకై కృషి చేయుచుండగలదు. ఈ కామన్వెల్తు కూటములో చేరెడి రాజ్యములన్నియు వేర్వేరు పద్ధతులపై ఇందు చేరుటకు వీలు లేదు. వేర్వేరు ఉపసంఘములుగ చేరుటకును వీలుగాదు. ఆవిషయమున మేమందరమును ఏకాభిప్రాయులమైతిమి" అని భారతప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ నేటిసాయంత్రం పత్రికావిలేఖరుల సమావేశంలో తమ లండన్ యాత్రానుభవములను వివరిస్తూ ప్రకటించిరి.

కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశానికి హాజరై వచ్చినతరువాత పత్రికా విలేఖరులను కలుసుకొనుట ఇదే మొదటిదఫా. భారతదేశం స్వతంత్ర సర్వాధికార ప్రజారాజ్యముగనే ఉండవలెనని చెప్పి ప్రస్తుతం ఏకాకిగా ఉండడం ఏ దేశానికి సాధ్యంగాదన్నారు. ప్రధాని ఈ సమావేశంలో అనేకవిషయములను చర్చించిరి. హైదరాబాద్‌ను భాషాప్రాంతాలుగ విభజించుటకిది సమయముగాదనిరి. భారతదేశంలోని ఫ్రెంచి, పోర్చుగీసు భూభాగాలు మాతృదేశంలో చేరిపోగలవనిరి. ఆసియాలో కమ్యూనిజం వ్యాప్తి, అఖిలాసియా రాజ్యసభ అనుగురించికూడ దీర్ఘముగ ముచ్చటించిరి. (ఈభాగములు విడివిడిగా ఆయా శీర్షికలక్రింద ప్రకటింపబడినవి.)

### లండన్ సంభాషణలు ప్రధానినెహ్రూ వివరణ

ఢిల్లీ, నవంబరు 12 : లండన్ నుండి తిరిగివచ్చిన తర్వాత నేడు ఇండియా ప్రభుత్వ ప్రధాన మంత్రి పండిత జవహరిలాలు నెహ్రూగారు పత్రికా ప్రతినిధులతో మొదటిసారిగా మాటలాడుచు యీ క్రింది విషయములను చెప్పిరి.

భారతదేశము సర్వస్వతంత్రాధికార ప్రజాస్వామ్యముగానే ఉండవలెను. యీ దేశపు పూర్వచరిత్రానుభవ పర్యవసానమే ఇది కనుక, కామనువెల్తు రాజ్యాలకూటములో భారతదేశమునకు ఏర్పడగల వ్యవహార సంబంధం చాలా పరిమితమై యుండగలదు. ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో మనము ఇతర దేశాలతో సంబంధాలు తెంపుకొని ఏకాకిగా ఉండుట వాంఛనీయముకాదు. ఐక్యరాజ్య సమితిలో మనకున్న సంబంధంగాక కామన్వెల్తు రాజ్యాలతో మనకుగల సంబంధం యథాపూర్వంగానే ఉంటూఉన్నది. ఇప్పుడు నిర్ణయిం

(4-వ పేజీ చూడుడు)

## "జపాన్ యుద్ధనేరస్తులలో ఏ ఒక్కరిపైనా కేసుబుజువుకాలేదు"

### అన్ని అభియోగాల క్రిందా అందరూ నిర్దోషులేనని భారతన్యాయమూర్తి తీర్పు

### చరిత్రతీర్పుట్రిబ్యునల్ నిర్ణయానికి విరుద్ధంగా ఉండవచ్చు

టోకియో, నవంబరు 12: యుద్ధనేరములను కాని, క్రౌర్యాచరణ నిందగాని పరాజితులైనవారిపైనే మోపరాదనీ, టోజో ప్రభృతులపై నేరములు బుజువుకాలేదనీ వారందరినీ అన్ని అభియోగాలక్రింద నిర్దోషులని విడిచిపెట్టవలెనని అంతర్జాతీయ మిలిటరీ న్యాయసంస్థలో భారత సభ్యులైన జస్టిస్ రాధావినోద్ పాల్‌గారు తమ తీర్పునిచ్చిరి. జస్టిస్ పాల్‌గారు న్యాయసంఘము తీర్పుతో ఏకీభవించ లేదు.

పాల్‌గారి తీర్పును కోర్టులో చదువరాదని న్యాయ సంఘాధ్యక్షుడు సర్ విలియమ్ వెబ్ (ఆస్ట్రేలియా) చెప్పెను. జస్టిస్ పాల్ ఒకసారి తమతీర్పును చదువ సుద్యుక్తులై లేచి నిలువబడిరి కాని వెంటనే విరమించుకొనిరి. న్యాయసంఘతీర్మానములో కొంత భాగమునకు ఇద్దరు న్యాయమూర్తులు (హాలండు, ఫ్రాన్సు) అంగీకరించలేదు.

యుద్ధముతో సంబంధించిన నేరములగురించి మాత్రమే ఈ న్యాయసంస్థ విచారించదగును కాని ఇతర విషయాలను విచారించు హక్కు లేదనీ, ఈ అభ్యంతరమును పాటించి తీరవలెననీ జస్టిస్ పాల్ తమ తీర్పులో చెప్పిరి. మంచూరియా మొదలగు సంఘటనలను విచారించుటకు ఈ న్యాయసంస్థకు అధికారములేదనిరి. తమ జాతిని కాపాడుకొను ఉద్దేశములో టోజో ప్రభృతులు ఈ కార్యములకు దిగినచో వారిని శిక్షించు అధికారములేదు. జాతీయాహంకారమును పురికొల్పి, తమ ఆధిక్యతను స్థాపించుకొనుటకు వారుచేసిన కార్యములను పరిశీలించినచో, వాస్తవానికి ఈనేరం పరాజయంపొందిన నాయకులపైనే మోపరాదని చెప్పిరి.

"ఉన్మత్త ఉద్వేగములు, విద్వేషములు కాలగతిలో చల్లారినప్పుడు, నిష్పక్షపాతము తొలగి హేతువు సమర్థించుకాలము వచ్చినప్పుడు, ధర్మబలమే నిందాప్రశంసలను తారుమారుచేయ నాయకుడు గలడు" అని ఒకరు చెప్పిన మాటలను జస్టిస్ పాల్ జ్ఞప్తికి తెచ్చిరి.

యుద్ధఖైదీలపై, వారు అత్యాచారములు జరిపినట్లు నిరూపించుటకు ఆధారమేదీలేదని జస్టిస్ పాల్ చెప్పినారు.

ప్రతీకారవాంఛను తల ఎత్తనీయరాని ఈసమయంలో, కేవలం కొన్ని రాజకీయ లక్ష్యాల లబ్ధికే ఈ న్యాయసంస్థ నిర్మింపబడిందని భావించుటకు అవకాశమివ్వరాదని జస్టిస్ పాల్ చెప్పిరి.

అన్యదేశాల నాక్రమించి అధికారం చలాయించవలెనని జపాన్ కుట్రచేసిందను ఆరోపణ గురించి వ్యాఖ్యానించుచూ, ఒక జాతిని మరొకజాతి పాలించవలెనను వాంఛ నేటి అంతర్జాతీయ రంగములో నేరముగా పరిగణింపబడుటలేదనిరి. బలవత్తరమైన దేశాలు ఇప్పుడు ఇదేరీతిని జీవిస్తున్నవి. ఇది నేరమని అంగీకరించినచో అంతర్జాతీయ వ్యవహారమంతా నేరం కాగలదు. ఇట్టి కార్యాలను ఇంకను ఏ దేశమూ నేరముగా పరిగణించుటలేదు. ఇట్టి నేరములుచేసిన దేశాలతో ఇతర దేశాలన్నీ సఖ్యముగానే ఉంటున్నవి.

దేశసేవచేయాలని మనసార కాంక్షించినవారు శత్రుదేశాలపై విద్వేషమ పెంచుకొనుట సహజమైనది. అట్టి దేశభక్తులకు సామాన్యుల సుగుణము లుండవు. వారి మాటలు, వర్తన, సభ్యత, వివాద గ్రస్తమై ఉండును. యుద్ధ సమయంలో ప్రజలు

[5 పేజి చూడుడు]

## బ్రిటన్ మాజీప్రధానితో భారత ప్రధానామాత్యుని ఇష్టాగోష్ఠి

### భూమి సంస్కరణవిషయమై చర్చిల్ శ్రద్ధ

న్యూఢిల్లీ, నవంబరు 12: భారత ప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ లండనులో ఉండగా బ్రిటన్ మాజీప్రధాని విన్‌స్టన్ చర్చిల్‌ను మూడు పర్యాయములు కలుసుకొనెను. అప్పుడు వారిరువురికీ జరిగిన ఇష్టాగోష్ఠి సంభాషణల గూర్చి పండిట్ నెహ్రూ నేడు పత్రికా విలేఖరుల సమావేశంలో ఈవిధంగా చెప్పారు:

నేను లండనులో నుండగా మాజీ బ్రిటిషు ప్రధానియగు చర్చిలును ముమ్మారు కలిసికొని మాటలాడితిని. మేము దీర్ఘంగా మాట్లాడినదేమియు లేదు. వెనుకటి విషయాలు మాట్లాడితిమి. కాని, భవిష్యత్తును గూర్చి ఎక్కువగా మాట్లాడలేదు. చర్చిలునన్నొక ప్రశ్న అడిగినాడు. "మీదేశంలో వ్యవసాయభూములసమస్యనుగూర్చి ఏమిచేయుచున్నారు?" అని ప్రశ్నించెను. మేము జమీందారీలను తొలగించుచున్నామనియు పెద్ద భూస్వాములకు నష్టపరిహారమునిచ్చి వారిని తొలగించుచున్నామనియు జవాబు చెప్పితిని. అంతట చర్చిలుగారు ఇండియాలో భూములు అమరకపుపద్ధతి అవసరమైంగావున్నదనియు దాని విషయములో కొంతమార్పు చేయవలెనని నేనే ఒకప్పుడు తలపెట్టితిననియు చెప్పిరి. ఆలస్యమయినప్పటికీ ఏదో కొంత పని జరిగినదని హర్షించిరి. రష్యన్ రాయబారియగు విషిన్‌స్కీని కలిసికొని మాట్లాడితిని. చాలా దీర్ఘంగా సంభాషించితిని. ప్రస్తుత సమస్యలనుగూర్చియేగాక ప్రపంచ ధోరణినిగూర్చి బాహుళ్యంగాకూడా మాట్లాడితిమి. ఈ సంభాషణల విషయమై నన్నేమి చెప్పవలసినదిగా మీరు కోరుచున్నారో నాకు తెలియదు. మేము ఖులాసాగా స్నేహభావంగా మాట్లాడుకున్నాము. విషిన్‌స్కీ తన ఉపన్యాసములలో భీకరంగా మాట్లాడినప్పటికి భోజనానంతరం బాతాఖానీ చేసేటప్పుడు చాలా ఖులాసాగా మాట్లాడుతాడు. (నవ్వు)

## రాజ్యాంగ ముసాయిదా

### యిప్పటివరకూ 4 వేల సవరణలు

న్యూఢిల్లీ, నవంబరు 12: భారత రాజ్యాంగముసాయిదాకు పరిషత్సభ్యులచే యింతవరకూ, 4000 సవరణలు అందచేయబడినవి. నజీరుద్దీన్ అందరికన్నా ఎక్కువ సవరణలను అందజేసెను. యీయన సవరణల మొత్తం సంఖ్య 1 271. పరిషత్తులోని కాంగ్రెస్ సభ్యులు తాము అందచేసిన అప్రధాన సవరణలను కొన్నింటిని పార్టీ ఆదేశం ప్రకారం, ఉపసంహరించుకొన్నప్పటికీ, కాంగ్రెసేతరులైన సభ్యులు తమ సవరణలను ఉపసంహరించుకొనరనే చెప్పవచ్చు.

రాజ్యాంగ ముసాయిదాపై యిన్ని సవరణలు ప్రతిపాదింపబడుటవల్ల, క్లాజువారీ చర్చకు నవంబర్ 15వ తేదీన రాజ్యాంగపరిషత్తు సమావేశమైనప్పుడు, అధ్యక్షుడు నిర్ణయించినప్రకారం పరిషత్కార్యక్రమం అంతచురుకుగా సాగదని, లోగడ అనుకొన్నట్లు, డిశంబర్ 9వ తేదీనాటికి రాజ్యాంగముసాయిదాను పరిషత్తు ఆమోదించుట సంభవం కాకపోవచ్చునని లాబీవర్గములవారు తలంచుచున్నారు. ఇప్పటి యేర్పాట్లప్రకారము, రాజ్యాంగపరిషత్తు నవంబర్ 15 లగాయితు డిశంబర్ 9వ తేదీవరకూ సమావేశమై, అటుపిమ్మట పరిషత్సభ్యులు జైపూర్ కాంగ్రెస్ మహాసభకు హాజరగుటకు వీలుగా 10 రోజులపాటు వాయిదాపడును. తిరుగాలేక డిశంబర్ 20 తేదీనో లేక 21వ తేదీనో రాజ్యాంగ ముసాయిదాను ఆమోదించుటకు మరల సమావేశమగును.

## మంచూరియా పతనానంతరం చాంగ్ కైషేక్ సేనకు తొలివిజయం

### సూచౌ రంగలో 37వేల కమ్యూనిస్టుసైనికులు హతమైనట్లు ప్రభుత్వ ప్రకటన

నాన్కింగ్, నవంబర్ 12 : నాన్కింగ్ నగరానికి ఉత్తర దిశలోని రక్షణదుర్గం సూచౌ సమీపంలో, గ్రాండ్ కెనాల్ మీద కమ్యూనిస్టులు ఘోరపరాజయానికి గురి అయిరని ప్రభుత్వ సైనిక వర్గాలు నేడు ప్రకటించినవి. 36 గంటలు హోరాహోరి పోరాడిన మీదట ప్రభుత్వ సైన్యాలు 160 వేల కమ్యూనిస్టు సైన్యాన్ని చెల్లాచెదరుచేసి వారిలో 37 వేల మందిని హతమార్చినదని ఆ వర్గాలు తెలియజేస్తున్నవి.

యుద్ధరంగంలో 10 వేలమంది కమ్యూనిస్టులు పడిపోయినారనీ, 4 వేలమంది నిరాయుధులుగా చేయబడినారనీ ప్రభుత్వ వర్గాలవలన తెలుస్తున్నది. ఈ విజయవార్త ప్రభుత్వవర్గాల వలన తెలుస్తున్నది. ఈ విజయవార్త ప్రభుత్వవర్గాలకు ఉత్సాహాన్ని కలిగించటమే కాక మంచూరియా పతనం తరువాత ఒకేపనిగా అపజయాలకు గురి అవుతున్న చాంగ్ ప్రభుత్వానికి నిక్కుతిప్పుకునే అవకాశం దొరికినది. ఈ ప్రాంతంలో వచ్చేనెలలో జరిగే యుద్ధంలో నాన్కింగ్ భవిష్యత్తు తేలిపోగలదు.

నాన్కింగ్-షాంఘయ్ ప్రాంతాల్లో ఆహారపు దొమ్మీలు, అశాంతి ప్రబలిపోవటంవల్ల నిన్నటినుండి మార్షల్ లా అమలు చేయబడినది. ఈ రంగానికి బలిష్టమైన ప్రభుత్వ సైన్యాలు అదనంగా రప్పించబడినవి.

గ్రాండ్ కెనాల్ పోరాటంలో ప్రభుత్వ సేనలకు కలిగిన అత్యద్భుత విజ

[4 పేజి చూడుడు]

## జపాన్ చక్రవర్తి నేరస్థుడే

### హిరోహిటోను కూడా విచారించాల్సి ఉన్నదని విచారణసంఘాధ్యక్షునితీర్పు

టోకియో, నవంబరు 12: జపాన్ చక్రవర్తి హిరోహిటో కూడా యుద్ధములకు కారకులలో ఒకడనీ, వాస్తవానికి చక్రవర్తినికూడా విచారించి యుండవలసినదనీ అంతర్జాతీయ మిలిటరీ న్యాయవిచారణ సంఘాధ్యక్షుడు సర్ విలియం వెబ్ తన తీర్పులో చెప్పినాడు. చక్రవర్తిపై నేర విచారణ చేయరాదను నియమం పాటించవలసి వచ్చినందువల్ల వారిని విచారించలేదు. కాని యుద్ధమునకు చక్రవర్తి బాధ్యతకూడా కలదని సర్ వెబ్ చెప్పినాడు.

యుద్ధ నాయకులలో చక్రవర్తికూడా ఒకడైనందువల్ల ఆ విషయమును దృష్టిలో పెట్టుకొని ఇతరులనుకూడా విచారించి యుండవలసిందనీ కాని అది ఇప్పుడు సాధ్యంకాలేదనీ చెప్పినాడు.

ప్రభుత్వ నిర్ణయాలకు మంత్రివర్గానిదే బాధ్యతగాని చక్రవర్తికి బాధ్యతలేదనుట పొరపాటు. మంత్రివర్గం యుద్ధానికి నిర్ణయించినచో చక్రవర్తికోరినచో నిరాకరించగలిగియుండెడివాడే. కాని హత్యచేయబడగలనను భయముతో అట్లు నిరాకరించలేదనుట సమర్థనీయము కాదని వెబ్ చెప్పినాడు.

మరణించినతరువాత పేరు మార్చుకొనే జపాన్ దేశాచారాన్ని అనుసరించి టోజో తన పేరును ఎయిషోయిన్ షకుజీ హామెయోరోకోజీ (బ్రతికి ఉండగా చేసిన తప్పులు మరణంతో పరిహారమవుతవి) అని మార్చుకున్నాడు.

పనిచేయకపోతే యుద్ధఖైదీలకు తిండి పెట్టవద్దని టోజో ఆజ్ఞాపించడంవల్ల అనేక మంది యుద్ధ ఖైదీలు జబ్బుతో ఉన్నవారుకూడా విధిలేక బర్మా-సయాం రైలు మార్గంలో పనిచేసి మరణించవలసి వచ్చినదని న్యాయాధిపతులు నిర్ణయించిరి. ఈ నేరస్తులు ఆజ్ఞాపించిన పద్ధతులనుబట్టి

5వ పేజి చూడుడు

### టోజో ప్రభృతుల శిక్షవివరాలు

అక్షరాజ్య నియంతల ముఠాలోనూ యుద్ధ నేరాలకు విచారించబడినది జనరల్ టోజో ఒకడే. జపాను చైనా, రష్యా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, హాలండ్‌లపై యుద్ధం చేయటానికి, అంతర్జాతీయ ధర్మాలకు విరుద్ధంగా యుద్ధఖైదీలను హింసించి వారి మరణాలకు కారణమయినందుకూ, ఆక్రమిత ప్రాంతాలలో దోపిడి, జనహత్య మొదలైన ఘోర కృత్యాలను జరిపించినందుకూ, ప్రధాన బాధ్యతవహించినవారని న్యాయాధిపతులవర్గం నిర్ణయించి జనరల్ హిడేకీ టోజో, కోకీ హిరోటా, హెయిటారో కిమూరా, ఇవానే మట్సూయి, అకీరా ముటో, కెంజీ డొయిహారా, సెయిషిరో ఇటగాకీలకు మరణదండన విధించిరి.

మూడు సం॥ల కిందట అరెస్టు చేసినప్పుడు టోజో ఆత్మహత్య చేసుకొనప్రయత్నించెను, కాని విఫలుడయ్యెను.

## మద్రాసు ఆరోగ్య మంత్రి రాక

### గుంటూరుజిల్లా వైద్యసంఘ సమావేశంలో ప్రసంగం

గుంటూరు, నవంబరు 10: చెన్నరాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ ఎ. బి. షెట్టి గారు నిన్న ఉదయం యిక్కడకువచ్చిరి. మంత్రిగారు మధ్యాహ్నం స్థానిక ప్రభుత్వ ఆస్పత్రిని తనిఖీచేసిరి. జిల్లా వైద్యశాఖాధికారి డా॥ సౌందరరాజన్‌గారు ఆస్పత్రికి ప్రస్తుతం కావలసిన అవసరములను మంత్రిగారికి విన్నవించిరి. షెట్టిగారు సాయంకాలం వైద్య కళాశాలను దర్శించిరి. కళాశాల ప్రిన్సిపాల్ డా॥ నరేన్‌గారు మంత్రిగారికి స్వాగత మిచ్చిరి.

విద్యార్థి సంఘంవారు షెట్టిగారికి ఒక నివేదికను సమర్పించిరి. విద్యార్థులకు వసతి గృహము కావలెననీ, ఆటలు ఆడుకొనుటకు స్థలము కావలెననీ, గ్రంథాలయమునకు పుస్తకములు కావలెననీ నివేదికలో కోరబడెను.

మంత్రిగారు సమాధానంగా ప్రభుత్వం విద్యార్థుల కోర్కెను తీర్చగలదని చెప్పిరి.

### జిల్లా వైద్యసంఘ సమావేశం

మంత్రిగారు యిక్కడకు వచ్చిన సందర్భంలో జిల్లా వైద్యసంఘ ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేయబడెను. జిల్లా వైద్యాధికారి డా॥ సుందరరాజన్‌గారు అధ్యక్షత వహించిరి. డా॥ జి. వి. హనుమంతరావుగారు మంత్రిగారికి వినతి పత్రము సమర్పించిరి.

మంత్రిగారు వినతి పత్రమునకు, సమాధానంగా వైద్యకళాశాల భవనముల నిర్మాణం విషయం మాట్లాడుచు ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం డబ్బు కొరత కల్గియున్నదనియు, నిదానం మీద యీ కార్యక్రమం సాగింప వచ్చుననియు చెప్పిరి. విద్యార్థులను ఎక్కువగా చేర్చు కొనుటను గూర్చి ప్రభుత్వం ఆలోచించ గలదని చెప్పిరి. క్షయరోగ ఆస్పత్రిని ఏర్పాటు చేయుటను గూర్చి మాట్లాడుచు, యిటువంటి ప్రజోపకరములను పనులు ధనికులు చేయించవలసి యుంటుందనీ, భూరి విరాళముల వలన గుంటూరులో కూడ క్షయంబత్తూరు వలెనే ధనిక వర్గము నుండి డబ్బు వసూలు చేసి. క్షయ రోగ ఆస్పత్రిని నిర్మించవచ్చునని చెప్పిరి. గుంటూరు నీటి సరఫరా స్కీమును గురించి మాట్లాడుచు యీ స్కీము ప్రారంభింపబడి పని జరుగుచున్నదనియు, కావలసిన పరికరముల కొరతగా నుండుటచే స్కీము పూర్తి అగుటకు రెండు సంవత్సరములు పట్టుననియు చెప్పిరి. గుంటూరులోని డాక్టర్లు పౌరుల ఆరోగ్యమునకు జబ్బు పరిశుభ్రతకు, ప్రభుత్వ కార్యక్రమమునకు తోడ్పడవలెనని కోరిరి.

మంత్రిగారు నిన్నరాత్రి చెన్నపురి వెళ్లిరి.

## ప. గో. జిల్లా కాంగ్రెస్ సంఘానికి ఎన్నికలు

ఏలూరు, నవంబరు 11: ఈ పట్టణము నుండి పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ సంఘానికిఒక సభ్యుని ఎన్నుకొనే నిమిత్తం నిన్న మధ్యాహ్నం కలగర కృష్ణారావుగారి, అధ్యక్షతను జరిగిన పట్టణ కాంగ్రెస్ సాధారణ సమావేశంలో ఆ స్థానానికి అకుల రామారావుగారు ఎన్నుకొనబడిరి.

ఏలూరుతాలూకా కాంగ్రెస్ నుండి జిల్లా కాంగ్రెస్‌కు యిద్దరు సభ్యులను ఎన్నుకొనుటకు నిమిత్తం తాలూకా కాంగ్రెస్ సాధారణ సమావేశం పోతునూరు కొమ్మారెడ్డి సత్యనారాయణ వరప్రసాదరావు అధ్యక్షతను జరిగెను. పైరెండుస్థానాలకు వల్లెపల్లి మాణిక్యారావు, వి. సత్యనారాయణగార్లు ఎన్నుకొనబడిరి.

## ఆస్ట్రేలియా గోధుమల దిగుమతి

విశాఖపట్నం, నవంబరు 12: ఇక్కడకు దిగుమతి అగు ఆస్ట్రేలియా గోధుమలో 9400 టన్నులు హైదరాబాద్, సి. పి. యు. పిలకు పంపకం చేయబడునని తెలిసినది. ఇప్పటి కప్పుడే రెండు ఓడలలో 3450 టన్నులు దిగుమతి అయినవి. ఇందులో 1400టన్నులు హైదరాబాద్‌కు, 600టన్నులు సి. పి. కి. 1450టన్నులు యు. పి. కి. పంపబడుచున్నవి. ఈ మాసాంతంలోగా మరి మూడు ఓడలలో 4000టన్నులు దిగుమతి కాగలవనీ, యిందులో 2600టన్నులు హైదరాబాద్‌కు 1900టన్నులు సి. పి. కి పంపబడుననీ తెలియుచున్నది.

గుంటూరుజిల్లా కో ఆపరేటివు సెంట్రల్ బ్యాంకు వారి ఆధ్వర్యమున తెనాలి బ్యాంకు ఆవరణలో యీనెల 6న ఆంతర్జాతీయ సహకార దినోత్సవం జరుపబడెను, సాయంకాలం వి. లక్ష్మీనారాయణ పంతులుగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగెను.

---

విజయవాడ నుండి పిఠాపురం ఉపాధ్యాయుల సంఘంవారు, కవిత్వ అగ్రముగ కవితా జాగారు జరిగెను ... సంవత్సరము, ... చలపతిరావుగారి అధ్యక్షతను నవంబరు 7: న ఉపాధ్యాయులు విందు జరిగెను.

# గాంధిజీ హత్య జరిగినరోజున నేను ఢిల్లీలో లేనని ఆప్టే ప్రకటన

## న్యాయమూర్తి ఆత్మాచరణ్ ప్రశ్నలకు రెండవ ముద్దాయి సమాధానాలు

లాల్‌జిల్లా (ఢిల్లీ), నవంబరు 12: గాంధీ హత్యకేసులో రెండవ ముద్దాయియగు నారాయణఆప్టేను స్పెషల్ జడ్జి ఆత్మాచరణ్ గారు నేడు యింకను ప్రశ్నలు వేయగా గత జనవరి 20 వ తేదీన తాను, గాడ్సే ఢిల్లీనుండి కాన్పూరునకు రాత్రి ఎక్స్‌ప్రెస్‌లో మొదటి తరగతియందు ప్రయాణము చేసిరని, కాన్పూరు స్టేషనులో విశ్రాంతి గదులలో బసచేసిరని, జనవరి 23 న తాను, గాడ్సే బొంబాయిలో ఆర్యపథికాశ్రమము నందును, జనవరి 24 నుండి 27వ కు ఎలిఫెంట్‌స్టన్ ఎనెక్సీ హోటలులోను బసచేసిరని చెప్పెను.

ఎలిఫెంటుస్టన్ ఎనెక్సీ హోటలులో వినాయకరావు, మిత్రుడు అను మారుపేర్లతోను బస చేసితిరా యని యడుగగా రిజిష్టరులో నెక్కింపబడిన విషయములు తన దస్తూరిలో లేవని, తన సమక్షమునందు గూడ అవి ఎక్కించబడలేదని, అవి నాథూరామ్ గాడ్సేచే ఎక్కించబడినట్లు కనబడుచున్నవని ఆప్టే చెప్పెను.

మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు జనవరి 24 న రాత్రి ఒంటిగంటకు తాను, తన మిత్రుడు ఆర్యపథికాశ్రమమునకువెళ్లిన విషయము, రాత్రి 2-30 కు తమగదియందలి విద్యుద్దీపములు వెలుగుచుండగా దీపము లార్పివేయవలసినదిగా కోరబడినవిషయము తమ సంభాషణ ముగిసిన వెనుక దీపము లార్పెదమని తాను, తన మిత్రుడు చెప్పినమాట వాస్తవము కాదనెను. 'హోటలు రిజిష్టరులో నీపేరు ఎక్కించుకొనవలసినది అని ఉదయము నా మిత్రుని యడుగగా, అతడు నా ముఖమువంక చూచినమాట, అంతట నేను ఆయన నాగదిలో నాతో కలిసియుండువాడని చెప్పినమాట, నేను అతని రైల్వేస్టేషనులో దిగబెట్టపోవుచున్నాను, తిరిగివచ్చినతరువాత నాకు పూర్తిగా ఒకగది నివ్వవలసినది, అప్పుడు మీరు అతనిపేరు 'రిజిష్టరులో' ఎక్కించవచ్చును అని చెప్పినమాట వాస్తవముకాదు' అని ఆప్టే చెప్పెను.

జనవరి 25 న రాత్రి 9 గంటలకు థానాలో జి. ఎమ్. జోషీ యింటికి వెళ్లలేదని, అచ్చట కార్కరు గాడ్సేలను కలియలేదని, ఆనాడు రాత్రి 9 గంటలవేళ తాను తనమిత్రునితో మాట్లాడుచుండగా తన్ను గోవింద్ మాలేకరు చూచెనని చెప్పెను.

జనవరి 27 న బొంబాయినుండి ఢిల్లీకి వెళ్లు ఎయిర్ ఇండియావిమానములో తనకు గాడ్సేకు నారాయణరావు, వినాయకరావు అను మారుపేర్లతో స్థానములు ప్రత్యేకించుకొన్నమాట, ఆ విమానములో యిద్దరు కలిసి వెళ్లినమాట నిజమేనని ఆప్టే అంగీకరించెను.

మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు జనవరి 26 ఉదయము తాను, గాడ్సే భూలేశ్వరు నందలి మేటూమందిరమునకు వెళ్ళినమాట నిజమేనని ఆప్టే చెప్పెను. కాని ఢిల్లీ దాటి వెళ్ళునప్పుడు తమ రక్షణకు రివాల్వరు అవసరమగుటచే ఒక రివాల్వరు యివ్వవలసినదని తాను దాదా మహారాజు నడుగలేదనెను. నిజమునకు దాదామహారాజుకే మేము ఆయుధములు సప్లయిచేయుస్థితిలో నుంటిమి. హైదరాబాదులో నుపయోగించుటకు అదివరకే మేము దాదామహారాజుకు ఆయుధములు మందుగుండు సప్లయిచేసియుంటిమి అని ఆప్టే చెప్పెను.

### గ్వాలియర్‌లోజరిగిన విశేషములు

జనవరి 27 న తాను, గాడ్సే ఢిల్లీలో శరణాగత శిబిరమును వీక్షించి ఆ రాత్రి రైలులో గ్వాలియరువెళ్లిరని, ఉదయము అచ్చటికి చేరినతరువాత ధర్మశాలలోనుండిరని, గ్వాలియరులో గరిబా, జగదీశ్ ప్రసాద్, గోయల్, మధుకర్ కేలులను తాను చూడలేదని ఆప్టే చెప్పెను.

ప్రశ్న: 28 ఉదయము నిన్ను గాడ్సేను మధుకర్ కేలు దత్తాత్రేయ పర్చూరు యింటిలో చూచెనుగదా! నీవు గాడ్సే రివాల్వర్లను పట్టుకొని వాని ఓసలను నొక్క ప్రయత్నించుచుంటిరిగదా! జగదీశ్ ప్రసాదు గోయల్ ఒక పిస్తోలును గురుపట్టి అది తన పిస్తోలని, నాథూరాం గాడ్సేకు ఒక పిస్తోలు కావలెనని గంగాధర దండావతే అడుగగా తాను అతని కిచ్చెనని చెప్పియుండెను.

ప్ర: పర్చూరు యింటిలో మధుకర్ కేలును చూచి యుండలేదు. గ్వాలియర్‌లో జగదీశ్ ప్రసాదును చూడలేదు. ఒక పిస్తోలును సేకరించుటకు గాడ్సే, నేను గ్వాలియరు వెళ్లితిమని ప్రాసిక్యూషనువారు సూచించుట హాస్యాస్పదము. అవసరమైనయెడల మాకు బొంబాయిలోనో పూనాలోనో ఒక పిస్తోలు దొరకియుండెడిది. ఢిల్లీలో ప్రదర్శన చేయుటకు బొంబాయిలో మాకు కావలసినంతమంది వాలంటీర్లు లభింపకుండిరి. మాకు ద్రవ్యముకూడ తరుగుగానుండెను. జనవరి 20 న బిర్లా భవనములో జరిగిన ప్రేలుడు సందర్భమున మేము అరెస్టు కావచ్చునని తలచుటచేత సాధ్యమైనంత త్వరలో ఢిల్లీలో ప్రదర్శనగావింప మేము వేగిరపడుచుంటిమి. పోలీసులు మెరీనా హోటలుపై దాడిచేసిరని నేను వార్తాపత్రికలలో చదివితిని. ఈకారణముచేత జనవరి 24 తేదీననో, ఆచాయలనో గ్వాలియరులో ప్రదర్శనలు జరిపిన దత్తాత్రేయ పర్చూరుద్వారా వాలంటీర్లను చేర్చ మేము బొంబాయిలో నిశ్చయించుకొని యుంటిమి. ఇందుకుగాను గాడ్సే, నేను గ్వాలియర్ వెళ్లితిమి. జనవరి 27 తేదీకి పూర్వము మేము బొంబాయిలోనుండగా, ఢిల్లీలో ప్రదర్శనచేయుటకు అచ్చటకి వెళ్ల గాడ్సే అయిష్టత చూపియుండెను. జనవరి 24 న తన వాలంటీర్లలో చాలామంది అరెస్టగుటచేత మాకు సహాయము చేయ డా॥ పర్చూరు అశక్తత వెల్లడించగా మాకు ఆశాభంగము కలిగెను. అంతట నేను 'మన ముభయులము బొంబాయి వెళ్లుదము' అని గాడ్సేకు సూచించితిని. కాని తాను ఢిల్లీ వెళ్లునని నేను వాలంటీర్లకై యేర్పాట్లు చేయుటకు బొంబాయి వెళ్లవలెనని గాడ్సే సూచించెను.

మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు జనవరి 29 న గాడ్సే ఢిల్లీ రైల్వే స్టేషనులో ఒక విశ్రాంతిగదిని ప్రత్యేకించుకొన్నమాట, బుక్కింగ్ ఆఫీసుకు తాను గాడ్సేతో వెళ్లినమాట, జనవరి 29, 30 తేదీలలో 6 నంబరు విశ్రాంతిగదిలో కార్కరు తనతోను, గాడ్సేతోను మాటలాడుచుండగా చూడబడినమాట నిజముకాదని ఆప్టే చెప్పెను. జనవరి 29 న తాను గ్వాలియరు నుండి బొంబాయికి రైలులో ప్రయాణము చేయుచుండెనని ఆతడనెను. మరియొక ప్రశ్నకు సమాధాన మొసంగుచు ఫిబ్రవరి 2 నుండి 3 వరకు తాను బొంబాయి సీగ్రీన్ హోటలులోను, ఫిబ్రవరి 3 నుండి 5 వరకు ఎలిఫంట్‌స్టన్ ఎనెక్సీ హోటలులోను నారాయణ్ రావు అను పేరుతో బసచేసినమాట వాస్తవమేనని, ఈ రెండు హోటళ్లలోను కార్కరు తనతో నెప్పుడు కలిసియుండలేదని, నిజమునకు తాను కార్కరును జనవరి 31 తేదీ ఉదయం వి. టి. రైల్వే స్టేషనులో మొదటిసారి చూచియుండెనని ఆప్టే చెప్పెను.

### మహాత్ముని హత్యవార్త శ్రవణము

జనవరి 28 న రాత్రి రైలులో గ్వాలియరునుండి బయలుదేరి జనవరి 30 ఉదయము బొంబాయిచేరి తన సామానులు వి. టి. రైల్వే స్టేషను గదిలో నుంచెనని ఆప్టే చెప్పుచు యిట్లనెను:— "ఆ రోజున నేను చెంబేరు శరణాగత శిబిరమునకు వెళ్ళి ఢిల్లీలో ప్రదర్శన చేయుటకు వచ్చుచున్న వాలంటీర్లు యెందుకు రాలేదు, వచ్చుటకు వారు సిద్ధముగానున్నారా అను విషయము కనుగొంటిని. తరువాత నేను రైల్వేస్టేషనుకు వెళ్లితిని. నాథూరామ్‌గాడ్సే మహాత్ముని హత్య గావించెనను వార్తను నేనచ్చట దాదాపు రాత్రి 9-30 కు వింటిని. అంతట నేను పూనా వెళ్లు ఉద్దేశ్యము మానుకొని ఆ రాత్రి వి. టి. రైల్వేస్టేషనులోనే యుంటిని. జనవరి 31 ఉదయము నేను రైల్వే స్టేషనులో కార్కరును కలసికొంటిని. తరువాత జమ్నాదాసు మెహతాకు టెలిఫోనుచేసి, ఆయనను చూడ వెళ్ళితిని. గ్రాంట్‌రోడ్డు రైల్వేస్టేషనులో దిగి వెళ్లుచుండగా తంతి కార్యాలయము వద్ద నాకు మిస్ మనోరమా సాల్వీ కనబడెను. ఢిల్లీ హిందూమహాసభ కార్యదర్శికి 'గాడ్సే కేసులో ప్రతివాదమునకై యేర్పాట్లుచేయుటకు ఢిల్లీవచ్చుచున్నాను' అను తంతివార్త పంపవలసినదని ఆమెతో చెప్పితిని. నా సమక్షముననే ఆమె తంతివార్త వ్రాసి పంపెను. ఆమె నుండి టెలిగ్రాఫ్ రసీదు నేను పుచ్చుకొంటిని. తరువాత జమ్నాదాసు మెహతాగాక మరియొక న్యాయవాదిని చూడ నేను నిశ్చయించుకొంటిని. తరువాత నేను చెంబేరు శరణాగత శిబిరమునకు వెళ్ళితిని, సాయంసమయమున జమ్నాదాస్ మెహతాను చూచితిని. ఫిబ్రవరి 8 వరకు నేను ఆ శిబిరములో నుంటిని.

### తప్పించుకొని తిరగడము

ప్ర: ఫిబ్రవరి 5 తేదీన పోలీసులు నీకొరకును, కార్కేరుకొరకును ఎలిఫెంట్‌స్టన్ ఎనెక్సీలు హోటలులో విచారింపగా నీవు హఠాత్తుగా హోటలువదలి ఆర్యపథికాశ్రమమునకు వెళ్ళితి విగదా! అచ్చట నీకు గది దొరకలేదుగదా!

ఈ ప్రశ్నకు సమాధాన మొసంగుచు ఫిబ్రవరి 5 న తాను ఆ హోటలును వదలి వెళ్ళెనని, తా నిదివరకే చెప్పినట్లు కార్కేరు తనతోలేడని, పోలీసులు తనకై విచారణ చేసినట్లు తనకు తెలియలేదని, తాను పథికాశ్రమమునకు గాక థానాయందలి జి. ఎమ్. జోషి యింటికి వెళ్లెనని, అచ్చట ఫిబ్రవరి 5 నుండి 13 తేదీవరకు నుండెనని, ఆ కాలములో తాను కార్కేరును జోషి యింట్లోను, శివాజీ ముద్రణాలయములోను రెండుమూడుసార్లు చూచెనని ఆప్టే చెప్పెను.

### నాథురామ్‌గాడ్సే లేఖ

ఫిబ్రవరి 8 న థానావదలి తాను పూనా వెళ్ళెనని, అచ్చట తనకు వచ్చిన ఉత్తరములు మాదకొనుచుండగా నాథురామ్‌గాడ్సే ఉత్తరము, ఫోటో కల కవరు ఒకటి కనిపించెనని, దానిని తాను భద్రము చేసెనని, తనకు వచ్చిన కవరు వంటి ఒక కవరును పోలీసు సూపరింటెండెంటు, డెప్యూటీ పోలీసు సూపరింటెండెంటు వశపరుచుకొనిరని తన సోదరుడు చెప్పెనని ఆప్టే అనెను. బొంబాయి సి. ఐ. డి. ఆఫీసులో అరెస్టులో నుండగా ఆ కవరును పోలీసు అధికారులు తనకు చూపి ఉత్తరం దస్తూరీ యెవ్వరిదని యడుగగా అది నాథురామ్ గాడ్సే దస్తూరీయని తాను చెప్పెనని, ఉత్తరము నందలి విషయములు తనకు చూపబడలేదు గాని ఫోటో చూపబడెనని ఆప్టే చెప్పెను.

ఫిబ్రవరి 13 నుండి తాను, కార్కేరు మారు పేర్లతో అపోలో హోటలులో నుండిరని ఫిబ్రవరి 14 తన అరెస్టు జరిగెనని ఆప్టే చెప్పెను. పూనాలో హిందూ మహాసభ వర్కర్ల యిండ్లు తగులబెట్టబడుటచేత అచ్చట నుండుట ఉపద్రవకరమని తలచి బొంబాయి వెళ్లి జోషీ యింటిలో నుండిరని, తరువాత జోషీ యింటినుండి వెళ్లి మరియొకచోట నుండ నిశ్చయించిరని ఆప్టే చెప్పెను. పోలీసులు తన్ను సోదాచేసి రైల్వే టిక్కట్లు వశపరుచుకొనిరనెను.

### అడవిలో జరిగిన వృత్తాంతము

అడవిలో తుపాకి కాల్చుటను అభ్యసించినవిషయమై న్యాయమూర్తి ప్రశ్నింపగా ఆప్టే యిట్లు చెప్పెను.

ఫిబ్రవరి 14 న నేను అరెస్టయిన తరువాత తాము చెప్పినట్లు చేయవలసినదని, అట్లు చేయకపోయినయెడల నన్ను, నా కుటుంబమును గూడ క్రూర హింసలపాలు చేసెదమని పోలీసులు నాతో చెప్పిరి. ఫిబ్రవరి 25 ఉదయము పోలీసులు నన్ను హిందూమహాసభా భవనము వెనుకనున్న ఒక అడవికి తీసికొనివెళ్లి ఒక వృక్షమును చూపి ఆ చెట్టును 'పంచాలకు' చూపవలెనని ఆజ్ఞాపించి తిరిగి పోలీసుస్టేషనుకు తీసికొనిపోయిరి. అపరాహ్ణం రెండు గంటలకు 'పంచాలు' తుగ్లక్‌రోడ్డు పోలీసు స్టేషనుకు వచ్చిరి. నేను వారిని అడవికి తీసికొనివెళ్లి వారికి ఆ చెట్టు చూపితిని. నన్ను ఢిల్లీకి తీసికొనివచ్చుటకు పూర్వము బొంబాయి సి. ఐ. డి. భవనములో కార్కేరు, గోపాల్‌గాడ్సే నాకు కనబడిరి. పోలీసులు చెప్పినట్లు చెయనియెడల వారు యమయాతనలు పెట్టెదరని వారు నాతో చెప్పిరి.

గ్వాలియర్‌లో డా॥ పర్చూరు యింటి దొడ్డిలో తుపాకిని ప్రయోగించినట్టి ప్రదేశమును ఫిబ్రవరి 27 న నీవు చూచితివిగదా యని యడుగగా ఆప్టే యిట్లనెను:- (1) గ్వాలియర్ పోలీసులు ఢిల్లీ పోలీసులంత తెలివైనవారుకారు. డా॥ పర్చూర్ యింటిదొడ్డిలో ఒక ప్రదేశమును చూపవలెనని వారు నన్ను అడిగిరి. వారు ఆస్థలమును చూపనూలేదు, ఆ స్థలమెచ్చటనున్నదో చెప్పనూలేదు. వారు నన్ను డా॥ పర్చూరుయింటికి తీసికొనిపోయిరి. నేను ఎడమవైపుకు తిరుగగా కుడివైపుకు తిరుగవలసినదని వారు చెప్పిరి. దొడ్డిలోనికివెళ్లినతరువాత నేనొక ప్రదేశమును చూపితిని. నే నెప్పుడూ అచ్చట తుపాకికాల్చుటను అభ్యసింపలేదు". ఆప్టేను ప్రశ్నలు వేయుట ముగియకపూర్వమే విచారణ రేపటికి వాయిదాపడెను.

### గాడ్సే ప్రకటనపై నిషేధం

అజ్మీర్, నవంబర్ 12: గాంధీజీని తానే హత్య చేసితినని ఒప్పుకొనుచూ నాథూరామ్‌గాడ్సే కోర్టులో చేసిన ప్రకటనను ప్రచురించడం గాని ప్రచారించడం గాని చేయకూడదని అజ్మీర్ మెర్వారా చీఫ్ కమీషనరు నేడు ఉత్తర్వు చేసెను.

### గాడ్సే వాఙ్మూలముపై తూర్పు పంజాబు నిషేధము

సిమ్లా, నవంబరు 12: గాంధీజీ హత్య విచారణలో నాథూరామ్ గాడ్సే ఇచ్చిన వాఙ్మూలము తూర్పు పంజాబులో ప్రచురించరాదని అక్కడి ప్రభుత్వము ఉత్తర్వు చేసెను. (యు. పి. ఐ.)

### ఒరిస్సాలో నిషేధం

కటక్, నవంబర్ 12: నాథూరాం గాడ్సే ఇటీవల యిచ్చిన వాఙ్మూలమును ఒరిస్సా రాష్ట్రములోను, ఒరిస్సా సంస్థానములలోను కూడ ప్రచురించరాదని నిషేధింపబడినది.

---

## మద్రాసు రేడియో

### (నవంబరు 15 సోమవారం)

మదరాసు. 2:

7 గ. స్వాగతం. 7-15 తె. వార్తలు. 7-30 ఎస్. సుబ్బలక్ష్మి. 8 ఇ. వార్తలు. 8-15 టాకీ రికార్డులు. 8-30 టి. కె. రంగనాథను. 12-30 హైస్కూళ్లకు ఇంగ్లీషు. 1 గ. మదార్ నిగచ్చి. 1-30 ఇ. వార్తలు. 1-40 ఫిల్మురికార్డులు. 2-5 తె. వార్తలు. 2-15 హైస్కూళ్లకు తెలుగులో. చేపలు, కప్పలు, ప్రసంగం. బి. ఎ. రామారావు. ఖగోళరాసులు, మిథునం - ప్రసంగం. 2-45 రికార్డులు. 4. ప్రాథమిక పాఠశాలలకు అరవంలో. 4-30 ఇ. వాయిద్యం. 5-30 జానం డేవిడు. 6. ఇ. వార్తలు. 6-30 గ్రామస్తుల కార్యక్రమం, పంటలనుబట్టి ఎరువులు. కంజాయ, కిరీటం, విశేషాలేమిటి. 7-15 తె. వార్తలు. 7-30 ఉస్తాదు ఫయ్యజ్‌ఖాను, పాట. 7-45 మళయాళ ప్రసంగం. 8. ఆర్. సావిత్రి శ్రీనివాసను. 8-30 ఎస్. బాలసుబ్రహ్మణ్యం. 9. ఇ. వార్తలు. 9-15 కాంతం తోటికోడలు, మునిమాణిక్యం నరసింహారావుగారి నాటకం. 9-40 ఎ. సుబ్బయ్య, ఫిడేలు. ఇతర వేళలందు రికార్డులు.

# సైనిక బలాల తగ్గింపు

## రాజకీయ సంఘంలో ఆరోపణలు

పారిస్, నవంబర్ 12: అగ్రరాజ్యాలు అయిమా తమ తమ సైనికబలాలను మూడవ వంతు చొ॥ తగ్గించవలెనను రష్యన్ తీర్మానముపై ఐక్యరాజ్యసమితి రాజకీయ సంఘంలో నేడు చర్చ కొనసాగింది. ప్రపంచంలో అశాంతికి రష్యా మూలమని చెప్పచూ అమెరికన్ ప్రతినిధి ఫ్రెడరిక్ ఆస్బర్న్ ఈ క్రింది హేతువులను వివరించినాడు. 1 బలము ప్రయోగించి కొన్ని ప్రాంతాలను ఆక్రమించుకున్నది. 2 తూర్పు యూరప్ దేశాలలో ప్రజాస్వామ్య పరిపాలనను నాశనంచేసింది. 3 జర్మనీ, జపాన్ దేశాలతో సంధి సమాలోచనలను భగ్నపరచింది. 4 ఆటంశక్తి కంట్రోల్‌కు 48 దేశాలంగీకరించిన ప్రతిపాదనను నిరాకరించింది. 5. భద్రతామండలిలో 28పర్యాయములు వీటో ప్రయోగించింది. 6. బెర్లిన్ ప్రతిష్టంభనా పరిష్కారానికి సామరస్య యత్నాలను పాటించలేదు.

సోవియట్ యూనియన్ ఇప్పుడు ఆదాయంలో నూటికి(16 వంతులను) సైన్యబలాలపైనా, మందుగుండు సామగ్రి ఉత్పత్తిపైనా ఖర్చించుచున్నదని ఆస్బర్న్ చెప్పినాడు. యునైటెడ్ స్టేట్సు ఆదాయంలో నూరింట 6 వంతులు మాత్రమే ఖర్చించుచున్నదట. రష్యా 40 లక్షల మంది గల సైన్యాన్ని, రష్యా మైత్రిగల దేశాలు మొత్తం 20 లక్షల మంది గల సైన్యాలనూ నిలుపరించినవి. అనగా పశ్చిమ రాజ్యాల బలాలకంటె అయిదురెట్లు. ఈ లెక్కను మూడోవంతు తగ్గింపువల్ల ప్రజల్లో యుద్ధభీతి, పరస్పరానుమానాలు తగ్గవని ఆస్బర్న్ చెప్పినాడు.

పోలండు ప్రతినిధి కాజ్ నూచీ యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వం బడ్జెట్‌లో ప్రతి డాలరులోనూ 80 సెంట్లు యుద్ధోత్పత్తికి ఖర్చించుచున్నదనీ, సోవియట్ రష్యాను యుద్ధానికి పురిగొల్పుటే అమెరికా ఉద్దేశమనీ చెప్పినాడు.

ఇతరదేశాలను చిక్కులు పెట్టవలెనను ఉద్దేశముతో రష్యా ఈ ప్రతిపాదన పెట్టినదని బ్రిటిషు ప్రతినిధి హెక్టర్ మెక్ నీల్ చెప్పినాడు. 1945 జూన్‌లో 50 లక్షల 90 వేల బ్రిటిష్‌సైన్యాన్ని 1948 సెప్టెంబరుకి 7 లక్షల 87 వేలకు బ్రిటిషుప్రభుత్వం తగ్గించి వేసిందని చెప్పినాడు. రష్యానుగురించి తనకు తెలిసినంతవరకూ 1945 లో వున్న 70 లక్షల సైన్యాన్ని ఇప్పుడు 40 లక్షలకు మాత్రమే తగ్గించిందని చెప్పినాడు.

ఇట్టి పరిస్థితిలో బ్రిటిషు ప్రభుత్వం మూడోవంతు తగ్గించుట కష్టమని చెప్పినాడు. రాజకీయ సంఘసమావేశం రేపటికి వాయిదా వెయ్యబడింది.

## విదేశ భాషలను బోధించుటకు ప్రత్యేక పాఠశాల

### భారతప్రభుత్వ రక్షణశాఖవారిచే యేర్పాటు

న్యూఢిల్లీ, నవంబరు 11: సైనికోద్యోగులకు విదేశభాషలతో పరిచయం కల్పించే నిమిత్తం భారతప్రభుత్వ శిక్షణశాఖవారు ఒక పాఠశాలను నెలకొల్పిరి. ఈ పాఠశాలలో, చైనీస్, ఫ్రెంచి, రష్యన్, జర్మన్, పరిష్యన్ అరబిక్, బర్మీస్, జాపనీస్ భాషలు నేర్పబడును. ఈ పాఠశాలలో, యితర ప్రభుత్వ శాఖోద్యోగులు గూడా ఆయా భాషలను నేర్చుకో వీలుండును. (స్వ. వి.)

## ఐక్యరాజ్యసమితి బహుమానం

న్యూఢిల్లీ, నవంబర్ 11: కడచిన నవంబర్ మాసములో ఐక్యరాజ్య సమితివారిచే యేర్పాటు చేయబడిన వ్యాసరచన పోటీయందు, మద్రాసు వాస్తవ్యులు, ఇ. వి. శ్రీనివాసన్ గారు విజయులైరి. ఈ పోటీయందు బహుమతుల నందిన పదిమందిలోను, ఆసియా వాసులలో వీరొక్కరే. వీరి వయస్సు 23 సంవత్సరములు.

ఐక్యరాజ్యసమితి కార్యక్రమమును అవగతము చేసుకొనుటకు, ఐక్యరాజ్య సమితి వీరిని, లేక్ సక్సెస్‌కు ఆహ్వానించినది. వారచ్చటికి వెళ్లుచూ ప్రస్తుతము ఢిల్లీలో దిగియున్నారు.

అంతర్జాతీయ విస్తృతిని, ఇట్టి వ్యాసరచన పోటీ యేర్పాటు చేయబడుట కిదియే ప్రథమము.

ఈ వ్యాసము యొక్క శీర్షిక—'ఐక్యరాజ్య సమితిలోని సామాన్య పౌరుని బాధ్యత'

### తగరపు కంట్రోలు

చెన్నపట్నం, నవంబరు 12: తగరపు (టిన్) కంట్రోలు ఇన్నిదినములనుండి, రెవెన్యూశాఖ వారి చేతులలో నున్నది ఇకనుంచి ఆ పనిని కంట్రోల్డ్ కమొడిటీస్ డైరెక్టరు నిర్వహించును.

# కాంగ్రెసు కార్యవర్గ సమావేశం

## ఫ్రెంచిఇండియా పరిస్థితిపై చర్చలు

న్యూఢిల్లీ, నవంబరు 12: కాంగ్రెసు కార్యవర్గం నేడు డా॥ రాజేంద్రప్రసాద్ గృహంలో సమావేశమై, ఈమధ్య ఫ్రెంచి ఇండియాలో జరిగిన ఎన్నికలనుగూర్చి, తదనంతర పరిస్థితులనుగూర్చి చర్చించినది.

కాంగ్రెసు బడ్జెట్‌నుగూర్చి, ఇతర వ్యవహారములనుగూర్చి గూడ చర్చలు జరిగినవట. 3 గంటలు చర్చలు జరిగినపిదప సభను వాయిదా వేసి, రేపు తిరిగి సర్దార్ పటేల్ గృహంలో సాగించుటకు వారు నిశ్చయించిరి.

డా॥ రాజేంద్రప్రసాద్ అస్వస్థులుగా ఉన్నందున, నేటి సభకు సర్దార్ అధ్యక్షుల వహించెను

నేటి సభకు, పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్, కిద్వాయ్, డా॥ పట్టాభి, పండిట్ పంత్, శంకర్రావ్ దేవ్, ఆచార్య జుగల్ కిషోర్, డా॥ పి. సి. ఘోష్, ఎస్. కె. పాటిల్, శ్రీమతి సుచేతకృపలాని, ఎన్. జి. రంగా, సర్దార్ ప్రతాపసింగులు హాజరైరి.

కార్మిక మంత్రి జగ్జీవనరాం కూడ ప్రత్యేకాహ్వానంపై హాజరయ్యెను.

# ప్రధాని నెహ్రూ అభిప్రాయం

న్యూఢిల్లీ, నవంబరు 12: "ఫ్రెంచిప్రాంతములున్నూ, పోర్చుగీసు ప్రాంతములున్నూ ఇండియా యూనియన్ ప్రభుత్వము క్రిందకు వచ్చి తీరవలెను. వాటియొక్క భవిష్యత్తు మరొక విధంగ నిర్ణయింపబడజాలదు" అని పండిట్ నెహ్రూ నేటి పత్రికావిలేఖరుల గోష్టిలో భారత దేశంలోని ఫ్రెంచి పోర్చుగీసు భాగముల భవిష్యత్తును గురించి తన విశ్వాసమును వెల్లడించిరి.

### ఇండియాలోని ఫ్రెంచిప్రాంతములు

ఇండియాలోని ఫ్రెంచి ప్రాంతాల భవిష్యత్తును గూర్చి సుమారొక సంవత్సరము నుండియు ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులతో మాట్లాడుచున్నాము. తొందరపడి ఏదీ చేయదలచుకోలేదు. ఫ్రాన్సుతో సహకార పద్ధతిగా వ్యవహరించడం మా సంకల్పం. కనుక, యీ ఫ్రెంచి ప్రాంతాల విషయములో ఫ్రాన్సు ప్రభుత్వముతో సంఘర్షణ చేయవలసిన అవసరములేదు. ఈదృష్టితో ఆలోచిస్తే, యీ ఫ్రెంచి ప్రాంతాలు ఉత్తరోత్తర ఇండియా ప్రభుత్వము క్రిందకు రాకతప్పదు కనుక, అవి కాలక్రమేణ వానియంతట అవియే సరియైన దారిలోనికి రాగలవు. ఆవిషయమై మనము కల్పించుకొని తొందర పెట్టడం అనవసరం. తొందరపెట్టితే వ్యవహారాలు చిక్కులపాలు కావచ్చును. జనవాక్య నిర్ణయము విషయములో ఫ్రెంచి ప్రభుత్వముతో మనమొక సమాధానమునకు రాగలము.

ఫ్రెంచి ప్రాంతాలలో ఇటీవల జరిగిన ఎన్నికల విషయములో ముఖ్యంగా దక్షిణ హిందూస్థానములో జరిగిన విషయములు మనకు వ్యాకులమును కలుగజేసినవి. అచట జరిగిన ఎన్నికల ఫలితములనుగూర్చి నేను మాట్లాడుటలేదు. అచటి ఎన్నిక పద్ధతులనుగూర్చి మాట్లాడుచున్నాను. ఈ విషయమై ఫ్రెంచి గవర్నమెంటుకు మనని వేదించితిమి. మాహేలో మాజరిగిన సంఘటనల సందర్భములో మాహేలోనికి బయటి ప్రాంతాలవారిని పోనివ్వవద్దని మలబారుజిల్లా కలెక్టరుకు మేము ఉత్తర్వులు చేసితిమి. ఇతడు వీరిని మిక్కిలి మాహేలోని ఫ్రెంచి అధికారులకు తోడ్పడెను. ఇండియాలో ఫ్రెంచి వారికి చిరకాలముగా కొన్ని ప్రాంతములు ఉంటూ వచ్చినవి. బ్రిటిషువారి అనుమతితోనే ఫ్రెంచివారికి అవి ఇక్కడ మిగిలియుండెను. ఇండియా ప్రభుత్వాదరణ సద్భావము లేకపోతే అటువంటి లంకల వంటి ప్రాంతాలు నిలువనేరవు. మాహేలోని సగంమంది ప్రజలు అచటనుండి పారిపోవుట చాలా శోచనీయము. వారందరిని తిరిగి అచటికి రానీయవలెనని ఫ్రెంచి ప్రభుత్వానికి నేను సలహాపూర్వకంగా చెప్పుచున్నాను. వారు తిరిగివస్తే అల్లరులు బయలుదేరునని కారణంచేత వారిని దండింపబూనుట చాలా అవివేకం.

## సయాంలో వ్యవసాయాభివృద్ధి

వాషింగ్టన్, నవంబరు 11: సయాంలో వ్యవసాయమును అడవులను అభివృద్ధి చేయడానికి ఒక ప్లానింగుబోర్డును (ప్రణాళీ నిర్ణాయక సంఘం) ఏర్పాటు చేయవలెనని ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ నియమించిన రాయబారవర్గం సిఫార్సు చేసినది. రాయబారవర్గం వ్యవసాయాభివృద్ధి ప్రధానంగా వరిపంట అభివృద్ధికి 118 ప్రత్యేక ప్రతిపాదనలను చేసినట్లు తెలియవచ్చినది.

# ఆసియాలో కమ్యూనిజం

## పార్టీ విధానంపై నెహ్రూ విమర్శ

### సిద్ధాంతవ్యాప్తికి కారణముల వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 12: ఆసియాలో కమ్యూనిస్టు ప్రమాదంగురించి పండిట్ నెహ్రూ నేటి పత్రికావిలేఖరుల సభలో ఈ క్రింద అభిప్రాయాలను వ్యక్తపరిచిరి.

చాలకాలం ఆసియాలో కమ్యూనిజం సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించడంలో జాతీయబలాలకు తోడై పని చేసినది. జాతీయోద్యమాలు సామ్రాజ్యశక్తులను ప్రతిఘటించుటే కాక సాంఘిక సమస్యల పట్ల ఒకవిధంగా, అస్పష్టముగా సామ్యవాదము నంగీకరించినవి. అందువలన సోవియట్ రష్యాపట్లనూ, కమ్యూనిజంపట్లనూ ఆసియాదేశాల్లో సానుభూతి కలిగింది. చైనాలోతప్ప మిగతా ఆసియాదేశాల్లో కమ్యూనిస్టుపార్టీలు ముఖ్యస్థానం పొందలేకపోయినవి. ప్రపంచసంగ్రామం సమాప్తికాగానే వచ్చిన పరిణామాలవలన కొంతవరకు కమ్యూనిస్టు పార్టీలు బలపడినవి. జాతీయోద్యమంప్రబలి కొన్ని దేశాల్లో పరిపాలన జాతీయవాదుల హస్తగతమైనది. ఈ జాతీయ ప్రభుత్వాలను ఆరంభంలో కమ్యూనిస్టులు కొంత బలపర్చినారు. కాని వెంటనే కమ్యూనిస్టులు జాతీయ ప్రభుత్వాలను విమర్శించి ప్రతిఘటించుటవరకూ వచ్చినది. బర్మా మలయాల వంటి దేశాలలో సాయుధ విప్లవాలు వచ్చినవి, అయితే విప్లవకారులందరూ కమ్యూనిస్టులు కారు. బర్మా, ఇండొనీషియాలలో జాతీయ ప్రభుత్వాలు కమ్యూనిస్టు తత్వాన్ని అంగీకరించినవి కాకపోయినా అచ్చటి ప్రభుత్వపక్షాలు కమ్యూనిస్టులతో దాదాపు సమానమైన వామపక్షాలు. వారివి సామ్యవాద కార్యక్రమాలు. అయినప్పటికీ కమ్యూనిస్టులు విప్లవాలు తెచ్చినారు. కమ్యూనిస్టులు జాతీయవాదులకు విరోధులైనారు.

### వారిప్రవర్తన వారికే హానికరం

కమ్యూనిస్టులు అవివేకంగా, మితిమీరి ప్రవర్తించినారు. పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు, జాతీయవాదులు సామ్యవాద కార్యక్రమములను అంగీకరించుచున్నప్పుడు కమ్యూనిస్టుల ప్రస్తుత ప్రవర్తన వారికే హానికరమైనది. అనగాకమ్యూనిస్టులు దేశంలోని పరిస్థితులు–చారిత్రిక దృష్టి–అర్థం చేసుకోలేదు. స్థానిక పరిస్థితులను గ్రహించలేని ఎవరో విదేశీయుల ఆదేశాలనువారుపాలించుచుండవలెనుబహుశా రెండువిధములా పొరబడి యుండవచ్చును. స్థానిక పరిస్థితుల కనుగుణంగా కార్యక్రమాలు నిర్ణయించవలెనను మార్క్సు సూత్రమును వారు మరిచినారన్నమాట. స్టాలిన్‌కూడా ఇదేసూత్రమును పలుమార్లు చెప్పియున్నాడు. ఏదిఎట్లున్నప్పటికీ ఈ దేశాలలో కమ్యూనిస్టులు విరోధం తెచ్చిపెట్టుకొనిరి.

ఇండొనీషియాలో సామ్యవాద ప్రభుత్వాన్ని యెదిరించి విరోధం తెచ్చుకొన్నారు మరొకటికూడా హేతువు ఉండవచ్చును. ఇండొనీషియాలో సామ్రాజ్య ప్రభుత్వం మూర్ఖత్వంవల్ల ప్రజలు విసుగెత్తియుండవచ్చును. జాతీయ ప్రభుత్వం సామ్రాజ్యవాదులతో పోరాటంలో పూర్తిగా జయించజాలనందువల్ల ప్రజలు మరొక అతివాద పక్షాన్ని చేరియుండవచ్చును. ఆ అతివాదపక్షంకమ్యూనిస్టులనే చేరియుండవనక్కరలేదు.

మలయాలో కార్మికుల పరిస్థితి అతిదుర్భరంగా వున్నది. ప్రజలు ఇది భరించలేక కమ్యూనిస్టుల నాయకత్వంక్రింద పోరాడుచున్నారు.

### అఖిల ఆసియా సమావేశం

పారిస్‌లో అఖిల ఆసియా సమావేశం గురించి వివిధ ఆసియాదేశప్రతినిధులతో ప్రసంగించినట్లు పండిట్ నెహ్రూ చెప్పిరి. మొదట సమావేశమును హాంగ్‌చౌ (చైనా)లో జరుపుటకు నిశ్చయించినప్పటికీ, తిరిగి భారతదేశమే తగిన స్థానమని తోచినందువల్ల ఇక్కడ జరుపుటకే నిశ్చయించబడిందని చెప్పి ఇంకా ఈక్రింది విషయాలను తెలిపిరి:

ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వంగల ఆసియాఖండ రాజ్యాల ప్రతినిధులు చాలామంది ప్యారిసుకు విచ్చేసిరి, వారితో కలిసి నేను మాటలాడితిని, యెక్కువ సన్నిహిత సంబంధమును అరాజ్యాలవారితో కలుగజేసికొను విషయమై మాటలాడితిని. రెండు సంవత్సరాలక్రిందట ఆసియాఖండ రాజ్యాలసభ ఇండియాలో జరిగింది. తిరిగి యీసభను సమావేశపరచువిషయమై మాటలాడితిమి. ఆసియాఖండ రాజ్యాలన్నియు పరస్పరముగా తమలో తాము అనేక విషయములను తెలిసికొనుచుండుటయున్నూ అయిక్యరాజ్య సమితిలో కలిసి పని చేయుటకును యీ సమావేశము అవసర[illegible]

# 'సామ్రాజ్యవాద ధోరణి మానవలెను'

## పాశ్చాత్య దేశాలకు ఆచార్య రంగా హెచ్చరిక

న్యూఢిల్లీ, నవంబర్ 12: నిన్నటి నాడు ఢిల్లీలోని ఒక కళాశాలలో విద్యార్థుల సమావేశములో మాట్లాడుచూ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు ఆచార్య యన్. జి. రంగా, "ప్రపంచ ప్రజాస్వామిక రాజ్యములు, ఆర్థిక, రాజకీయ రంగములందు తమ సామ్రాజ్యవాద ధోరణిని మొత్తముగా వదలివేయవలయును. వంచితమైన జాతీయ సార్వభౌమ తాభిలాషను, మాని ప్రజాస్వామిక రాజ్యముల మధ్య పరస్పర సహకార సమైక్యతలు పెంపొందుటకు వాతావరణమును కల్పింపవలయును. నిరంకుశ నియంతృత్వముల నెదుర్కొనుటకు బలవత్తరమైన ప్రజాస్వామిక సమాఖ్య యేర్పడుటకు అవసరమైన త్యాగములు చేయవలయును.

"కేవలము రాజకీయ ప్రజాస్వామికమే గాక, మహాత్ముని ఆదేశముల ననుసరించి ఆర్థిక, సాంఘిక, ప్రజాస్వామికములు పెంపొందవలయునని, గుర్తించి, పశ్చిమ ప్రజాస్వామిక రాజ్యములు, ఇతర ప్రజాస్వామికములలో అహింసాయుతమైన స్నేహసౌహార్దములతో మెలంగ గలిగినప్పుడే, ప్రపంచ ప్రజల యభివృద్ధికి, ప్రజాస్వామిక ప్రభుత్వములకు రక్షణయున్నది."

## బ్రిటిషు సోవియటు సొసైటీలో గలభా

లండను, నవంబరు 11: బ్రిటను రష్యాల మధ్య స్నేహభావమును పెంపొందించుటకై పనిచేయుచున్న బ్రిటిషు సోవియటు సొసైటీవారి సభలో నేటిరాత్రి ఒకరు మాట్లాడుచుండగా ముందు కూర్చున్న వారిలో కొందరు, "ఇది రష్యాప్రచారం" అని కేకలువేసిరి. వారిని బయటికి పంపుటకు నాకర్లు ప్రయత్నముచేయు సమయమున గలభాసాగి గుద్దులాటలూ, కుర్చీలు విరుగగొట్టడాలూ, మతాబాలు కాల్చడాలూ సాగెను. కొందరికి దెబ్బలు తగిలినవి. క్రమముగా అల్లరి సమసి సభ సాగినది.

రష్మి యున్నది. ఆసియాఖండ రాజ్యాలకు భారతదేశము నాయకత్వం వహించవలెననేమాట నాకురుచింపదు. భౌగోళికంగాను, ఆర్థిక సంపదలలోను దేశ విస్తీర్ణంలోను శక్తి సామర్థ్యంలోను భారతదేశం ఆసియాలోని ప్రాక్పశ్చిమ రాజ్యాలకున్నూ ఆగ్నేయాసియా రాజ్యాలకున్నూ కేంద్రస్థానముగా సమావేశరంగంగా ఉండవచ్చును. రక్షణావసరములకుగాని, ఆర్థిక సంపదలలోగాని ఆసియాకు భారతదేశం ఆయువుపట్టు గానుండగలదు. యుగయుగాల చరిత్ర పరిపాకంవల్ల భారతదేశానికి యీ పరిస్థితి ఏర్పడింది.

### ఇండొనీసియా సంఘటనలు

"ఇండొనీషియాలో జరుగుతున్న విషయాలను, భారతదేశం చాలా శ్రద్ధగా గమనిస్తోంది తిరిగి అక్కడ వ్యగ్రచర్యలు ప్రారంభమైతే అందువల్లకలిగే పర్యవసానములు చాలావరకు విస్తరించగలవు. ఆ విషయంలో సందేహంలేదు. ఇండొనీషియాలో సమాధానం ఏర్పడే అవకాశం ఉంది. కాని తిరిగి అక్కడ యుద్ధం ప్రజ్వలించును. ఇండొనీషియాలో ఏదైనా విప్లవమిస్తే దానిఫలితం ఇండియాలోను ఆగ్నేయాసియా అంతటను ఉండగలదనే విషయం ప్యారిసులోను లండనులోను ప్రముఖులు గ్రహించినట్లుగా కన్పించదు. అచటి ప్రముఖులు తమ అయిరోపాఖండ పశ్చిమ రాజ్యములకూటమి విషయమై ఎక్కువ నిమగ్నులైయున్నారు. అందువల్ల ఇతర ప్రధాన సమస్యలనుగూర్చి ఆలోచించుటలేదు. వారితోకలిసి లండనులోను ప్యారిసులోను చర్చలు జరుపుటవల్ల యీ సమస్యల యెడకూడా వారి దృష్టిని సరియైన ధోరణిలోనికి ఆకర్షింపగల్గితిని."

పాశ్చాత్యదేశాల రక్షణకుగాని మరే దేశాల రక్షణకుగాని భారతదేశం తోడ్పడవలసిన నిర్బంధమేమీ లేదని పండిట్ నెహ్రూ చెప్పిరి.

మధ్యప్రాచ్యదేశాలు మతాధారంపై ఒక వర్గంగా చేరుటను వదంతులను గురించి ఒక పత్రికా విలేఖరి ప్రశ్నించగా, అట్టి యత్నాలు చేయువారున్నమాట నిజమేననిరి. "ఐక్యరాజ్య సమితిలో కూడా అట్టి యత్నాలు జరిగినవి. అయితే ముస్లింవర్గం ఆచేవానికి వాస్తవికత లేదు. భారతదేశం సహకారం లేనిదే వారికి బలం చేకూరదని ఈ దేశాలన్నీ గ్రహించినవి. ఈ మధ్యప్రాచ్యదేశాలన్నిటికీ కేంద్రస్థానం ఈజిప్టులో పారిస్‌నుండి వచ్చుటప్పుడు అరబ్ లీగ్ ప్రతినిధులతోనూ కొన్ని ప్రభుత్వాల ప్రతినిధులతోనూ సంభాషించినాను. ఈజిప్టులో భారతదేశం పట్ల సుహృద్భావం ఉన్నది." అని ప్రధాని తెలిపెను.

# గ్రీస్ ప్రధాని రాజీనామా

## పార్లమెంట్ విశ్వాసం కోల్పోయినట్లు ప్రకటన

ఏథెన్సు, నవంబరు 12: గ్రీస్ ప్రధాని యం. థెమిస్టొకిల్సు సోఫూలిస్, నేడు తన రాజీనామాను పాల్ రాజునకు అందజేసినాడు.

పార్లమెంటుకు తన మంత్రివర్గమునందు విశ్వాసము పోయినదనీ, ఆ కారణముగా తాను రాజీనామా నొసంగుచున్నాననీ ఆయన తెలుపుచున్నాడు.

పాల్‌రాజుకు రాజీనామా నొసంగి బయటికి వచ్చి, ఆయన తన మంత్రివర్గమును పునర్నిర్మించు విషయమున సల్టారిస్ పార్టీకి ప్రాబల్యమున్నది గనుక వారితో ఆలోచించవలసినదిగా సూచించియున్నానని తెల్పినారు.

వచ్చే సోమవారము నాడు 'బాల్కన్ రాజ్యాల సమావేశ'మునకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయముల చర్చించుచూ సల్టారిస్ ప్రస్తుతము పారిస్‌లో నున్నారు.

## వాతావరణ పరిస్థితి వార్తలు ప్రసారంచేయుడం గురించి చర్చలు

న్యూఢిల్లీ, నవంబరు 11: విమానయానములకు, నౌకాయానములకు, ఇతరములైనవాటికి, ఉపయుక్తముగానుండు విధమున, వాతావరణసంబంధమైన సమాచారమును, బ్రాడ్‌కాస్టు చేయుపద్ధతిని మార్పు చేయవలెనని, అంతర్జాతీయ వాతావరణ సంస్థ ఆసియా ప్రాంత కమిషన్ సమావేశంలో నేడు పలువురు సభ్యులు సూచించిరి. నేటి సమావేశమునకు, డా॥ యస్. కె. బెనర్జీ అధ్యక్షతవహించెను. ఆసియా ఖండములో సబ్ రీజినల్ వాతావరణ సమాచార బ్రాడ్‌కాస్టులకు సంబంధించి ఒక పథకమును తయారుచేయుటకు, యీ రోజు సమావేశంలో ఒక ఉపసంఘం నియమింపబడెను. సబ్ రీజియన్స్ (ఉపప్రాంతములు) లేవో యీ ఉపసంఘమే నిర్వచించును. వాతావరణ శాస్త్రపరిశోధకులు వాడే, కోడ్స్, యూనిట్స్, సవరించే నిమిత్తం అవసరమైన సూచనలు చేయుటకు 9 మంది సభ్యులతో కూడిన ఒక ఉపసంఘంగూడా నియోగింపబడెను.

కమిషన్ సమావేశం రేపుకూడా జరుగును.

## రష్యన్ మంగోలియన్ ప్రతినిధుల రాక

అంతర్జాతీయ వాతావరణసంస్థ ఆసియా ప్రాంతీయ కమిషన్ సమావేశంలో పాల్గొనే నిమిత్తం, రష్యన్ మంగోలియన్ ప్రతినిధులు, నేడు విమానంలో ఢిల్లీ చేరుకొనిరి.

## సిగరెట్ల కరవు

బొంబాయి, నవంబర్ 11: విదేశములనుండి దిగుమతియగుచున్న సిగరెట్లలో, బాగా వాడుకలోనున్న అన్ని రకముల సిగరెట్లు బొంబాయిలో అపరూపమై పోవుచున్నవి. ఎచ్చటనైనా కొద్దిగా దొరికిననూ, నూటికి 30 వంతున ధరలు పెంచి అమ్ముచున్నారు. దిగుమతి సుంకములను ప్రభుత్వము నూటికి 25 వంతున పెంచియుండుటచే యిట్టి స్థితి యేర్పడినదట. కేవలం వినిమయ దారులు నిన్ననూ, మొన్ననూ హడావిడిపడి చాలాసిగరెట్లుకొని దాచుచుండుటచేతనే ఈస్థితి యేర్పడినదని చెప్పుటకువీలులేదు. వివిధ రకముల సారాయిల ధరలుకూడ ఇదే తలంపులో పెంచుచున్నారు.

## విశాఖపట్నంలో 'ఢిల్లీ' యుద్ధనౌక

విశాఖపట్నం, నవంబరు 11: భారత ప్రథమ యుద్ధనౌక 'ఢిల్లీ' నేటి సాయంకాలం 4 గం. 45 ని. లకు 'కృష్ణా' 'సట్లెజ్' స్లూపులతో విశాఖపట్నం హార్బరు చేరినది. జిల్లా కలెక్టరు జె. ఎల్. మెనాయ్, పోలీసు సూపర్నెంటు, బాలకృష్ణనాయర్, ఐ. ఎన్. వంకవాలా, కురుపాంరాజా, వి. వి. వీరభద్రరావు (ఎం. ఎల్. సి), డా॥ సి. ఆర్. రెడ్డి, కె. వి. గోపాలస్వామి, వి. ఎస్. కృష్ణ, మొదలగు ప్రముఖులు నౌకకు స్వాగతమిచ్చిరి. నౌకలో వచ్చిన రియర్ అడ్మిరల్ హాల్ తీరమునకు దిగి 'సర్కార్స్' నావికులు సమర్పించిన వందనమును స్వీకరించిరి. నౌకా పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు స్థానిక పత్రికా ప్రతినిధులకు నౌకను చూపించిరి. ఆదివారంనాడు విద్యార్థులు, స్త్రీలు, చూచుటకు ఏర్పాటు చేయబడెను. 16 వ తేదీన ఒరిస్సాగవర్నరు ఆసఫ్‌అలీ నౌకను చూచును. భారత ప్రభుత్వ రక్షణశాఖ కార్యదర్శి 15 న వచ్చి నౌకలో కలకత్తావరకు వెళ్లెదరు. నౌకను ప్రజలందరూ చూచుటకు ఏర్పాట్లు చేయబడినవి.

## ఇజ్రాయిల్ ప్రభుత్వమునకు జకోస్లావేకియా సహాయం

బవేరియా, నవంబర్ 12: జకోస్లావేకియా, ఇజ్రాయిల్ ప్రభుత్వమునకు ఒక వంద ఫైటర్ విమానములను అందజేసినదని, జ్యూయిష్ వర్గములనుండి ఒకవార్త తెలియుచున్నది. జాటల్ చనూటోన్, రోకీకనీ, పిసెర్ అను నాల్గు విమానముల నుండి యీ విమానములు సరఫరా చేయబడినవి. ఈ విమానములను జేరవేసిన విమాన చోదకులలో, మాజీ అమెరికన్ విమాన సైనికులును, హంగేరియనులును కలరట. ఒక్క జాటల్ విమాన కేంద్రము నుండియే ఒకేరోజున నాలుగు టూడీలుగా సరఫరాలు సాగినవి.

### జెకొస్లావాకియా ఒప్పుకోలు

ప్రేగ్, నవంబరు 11: జెకోస్లావాకియా ప్రభుత్వం యూదులకు పెద్ద ఎత్తున ఆయుధసామగ్రిని సప్లై చేయుచున్నదని, జెక్ ఆరోగ్యశాఖామంత్రి జోసెఫ్ ప్లొజెర్ గతరాత్రి ఇక్కడ జెకోస్లావాకియా - ఇజ్రాయిల్ స్నేహ సమాజమును ప్రారంభించుచూ ప్రకటన చేసెను. కాని ఉపన్యాసాన్ని ప్రచురించునప్పుడు ఈ మాటలను వదిలివేయవలసిందని ప్రభుత్వ సమాచారశాఖ వార్తాసంస్థలకు పత్రికలకు ఉత్తర్వు చేసెను. జెకోస్లావాకియా 100 మెస్సర్ స్మిట్ విమానములను ఇజ్రాయిల్‌కు సప్లై చేసినదని యూదు వర్గములద్వారా రాయిటర్‌కు విశ్వసనీయముగా తెలియవచ్చినది.

## ఇజ్రాయిల్ - అరబ్ శాంతి రాయబారాలు

జెరుసెలమ్, నవంబరు 13: ట్రాన్స్ జోర్డాన్ రాజు అబ్దుల్లా, ఇజ్రాయిల్ అధ్యక్షుడు డా॥ వైజ్‌మన్ శాంతి సంప్రతింపులు జరుపుటకై జెరుసెలమ్‌లో సమావేశ మగుదురని నిన్న అపరాహ్ణం "యెడియోత్ హారొనోథ్" అనే ఒక హెబ్రూ పత్రిక ప్రకటించెను.

ఈ వార్త వెలువడిన వెంటనే జెరుసెలమ్ నగరం శాంతి సంప్రదింపుల గురించిన వదంతులతో అట్టుడికినట్లు ఉడికిపోయింది. అయితే "ఎడియోత్ హారనోథ్" ప్రకటించిన ఈవార్త ఇంకా ధ్రువపడలేదు.

### డైలీ టెలిగ్రాఫ్ విలేఖరి వార్త

లండన్, నవంబర్ 13: ఇజ్రాయిల్ ప్రభుత్వం ట్రాన్స్‌జోర్డాన్ ఈజిప్టులతో శాంతి రాయబారములు సాగించుచున్నట్లు తెలియవచ్చినదని, డైలీ టెలిగ్రాఫ్ ప్రత్యేకవిలేఖరి ఎరిక్ జొనెటాప్ టెలవీవ్ నుంచి వ్రాయుచున్నాడు.

ఇజ్రాయిల్ ప్రధానమంత్రి బెన్ గూరియన్ ఈ విషయమును 8 గురు అమెరికన్ పత్రికా విలేఖరులకు నేడు టెల్‌అవీవ్‌లో తెలియజేసెనని ఆ విలేఖరి వ్రాసెను.

## జెరుసేలమ్‌లో పోరాటం

అమ్మాన్, నవంబరు 12: యూదులు జెరుసెలమ్‌లోని అరబ్ స్థావరములపై రాత్రిఅంతా శతఘ్ని కాల్పులు జరుపుచునే ఉన్నారని ఇక్కడ అధికారరీత్యా ప్రకటింపబడెను. ఇద్దరు అరబ్బులకు తీవ్రంగాను 6 గురికి కొద్దిగాను గాయములుఅయినవి. షెబిబాద్ అరబ్ స్థావరంమీదికి ఒక యూదుపటాలం దాడిచేయుగా, అరబ్బులు ఎదురుదాడిచేసి వారిని తరిమివేసిరట.

---

### కీ. శే. ఆర్. సుశీలాబాయమ్మగారు

మదనపల్లి, నవంబరు 11: స్థానిక మహిళా సమాజ ప్రధాన కార్యదర్శి, గౌరవ మేజస్ట్రేటు, అగు శ్రీమతి ఆర్. సుశీలాబాయమ్మగారు నిన్న దివంగతులైరి. ఈమె స్థానిక దివ్యజ్ఞానఉన్నత పాఠశాల పూర్వ విద్యార్థిని అగుటచే పాఠశాల అధికార్లు యీమె మరణమునకు చింతించుచు, సంతాపసూచకంగా నిన్న పాఠశాల మూసివేసిరి. ఈమె భర్త, యిద్దరు పిల్లలు దుఃఖంలో మునిగియున్నారు.

---

### కీ. శే. శిష్ట్లా సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

ధర్మవరము, నవంబరు 9: ఈ తాలూకా నాగసముద్ర గ్రామవాస్తవ్యులు బ్రహ్మశ్రీ శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొన్న, చిన్నవయస్సున నిర్యాణ మొందిరని తెల్పుటకెంతయు చింతిలుచున్నది.

అల్పవయస్కులైనను వీరు మిగుల తపస్సంపన్నులు, మంత్రవేత్తలు, పూర్వాపర ప్రయోక్తలు, రామభక్తులు. ఏటేటా రామనవరాత్రములు వైభవముగా శాస్త్రోక్తముగా జరుపువారు. నిరతాన్న దాతలు. నాటకాంతసాహితికవారు. ఈ ప్రాంతమున సజ్జనోత్తములని పేరుపడసినవారు. గొంతుక్రింద గడ్డలుకట్టి, వాటిప్రకోపముచే 1½ దినము బాధపడి యిహలోకము వదలిరి. (స్వ. వి.)

## శాంతిభద్రతలపేర పౌర స్వాతంత్ర్యమును హరింపరాదు

### ప్రభుత్వవిధానంపైసోషలిస్టు నాయకుని విమర్శ

చెన్నపట్నం, నవంబరు 13: "శాంతిభద్రతలను కాపాడు నెపముతో అవసరాభివృద్ధి కార్యక్రమములు అశ్రద్ధ చేయబడుచున్నవి. సహేతుక విమర్శలు ప్రభుత్వమువారికి రుచించుటలేదు. విమర్శలను సహృదయముతో స్వీకరించి తదనుగుణముగా తమ విధానములను కార్యక్రమములనునిర్ణయించుకొనుట ప్రభుత్వ ధర్మము. అట్టి ధర్మ నిర్వహణకు మారుగా, విమర్శకులను విరోధులుగా భావించి, పౌర స్వాతంత్ర్యమునరికట్టబూనుట శోచనీయము. పౌరస్వాతంత్ర్యము నరికట్టినచో ఘర్షణ తప్పదు" అని సోషలిస్టుపార్టీ నాయకుడు శ్రీ అశోక్‌మెహతా నిన్న సాయంత్రము గోఖేల్‌హాల్‌లో జరిగిన బహిరంగసభలో ప్రసంగించుచూ ప్రభుత్వమును హెచ్చరించిరి.

సభకు డా॥ కె. బి. మీనన్ అధ్యక్షత వహించిరి. శ్రీ అశోక్ మెహతా హాల్‌లోనికి ప్రవేశించుటతోడనే సభ్యులు దీర్ఘ హర్షధ్వానములు చేసిరి. వివిధ కార్మిక, యువజన సంస్థల తరఫున శ్రీ మెహతాకు పూలమాలలు సమర్పింపబడెను. డా॥ మీనన్ అధ్యక్షస్థాన మలంకరించుచూ మాహే ప్రజలు ఫ్రెంచి సామ్రాజ్య తత్వముపై జరిపిన సమరమును వివరించుచూ, ప్రజలందరునూ మాహేదేశభక్తులకు సహాయము చేయవలెనని విన్నవించిరి.

శ్రీ అశోక్ మెహతా ప్రసంగించుచూ ప్రజాస్వామిక వ్యవస్థలో, ప్రజాభిప్రాయమే ప్రభుత్వమునకు ధృవతార యనిరి. అంతమాత్రమున ప్రజలు యథేచ్ఛా విమర్శనలు చేయరాదు. వాస్తవమునకు సోషలిస్టుపార్టీ ఎంతయో జాగ్రత్తతో, బాధ్యతతో, మానవసహజావేశమును అణచుకొని ప్రభుత్వమునకు అనేక సూచనలను చేయుచున్నది. దురదృష్టవశాత్తు మనలో కొందరు కేవలం "ఒక సంఘసభ్యుల" ప్రయత్నఫలితముగా మాత్రమే స్వాతంత్ర్యం సిద్ధించినదని చెప్పుకొనుట కలవాటుపడి యున్నారు. స్వాతంత్ర్య సంపాదనకై సర్వసంగ పరిత్యాగముచేసిన అజ్ఞాత వీరులను మనము మరువరాదు.

ఇంతకుముందు మనపోరాటము పరాయివారితో మాత్రమే. పరాయివారైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మనదేశమును వదలిపోయిరి. వారుపోయిన తదుపరి మన రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు మారగలవని మనమందరము ఆశించితిమి. కాని ఏమి జరుగుచున్నది? కొందరికి మార్పు అయివ్వడము. వారికి శాంతిభద్రతలు మాత్రమే అవసరము. ప్రజాజీవితములో మార్పులు లేకుండగ, శాంతిభద్రతలను కాపాడుటకే పరిపాలన సాగించిన ఈ ప్రపంచ నాగరికతా ప్రవాహములో మన పడవ వెనుకపడిపోవును. మనకు మార్పులు కావలెను. శాంతిభద్రతలుకూడా కావలెను. మార్పు అరాచకమునకు దారితీయునని కొందరి వాదము. ప్రస్తుతము మార్పులు జరుగకున్న అరాచకము సంభవించునని సోషలిస్టుల వాదము.

ప్రస్తుతము మనదేశము ఎదుర్కొనుచున్న ముఖ్యసమస్య ఆర్థిక సంబంధమైనదని కాంగ్రెసు నాయకులుకూడా ఒప్పుకొనుచున్నారు. ఈ సమస్యను పరిష్కరించుటకు సర్వప్రజాసహకారము కావలెననికూడా వారనుచున్నారు. ఉత్పత్తి ఎక్కువచేయవలెనని విన్నవించుచున్నారు. అధికోత్పత్తిని చేయకున్న ప్రజలు నాశన మగుదురనికూడా హెచ్చరించుచున్నారు. కాని మన ఆర్థికవ్యవస్థసామాన్య మానవుని జీవితమునకనుగుణముగా నున్నదా? సామాన్య ప్రజానుభవముల నాధారము చేసికొని ఆర్థిక వ్యవస్థలో మార్పులు చేయుచున్నారా? ప్రజాసామాన్యపు క్షేమముయొక్క ఫలితములను ప్రజానీకములో సమముగా పంచవలెను. కొద్దిమంది అదృష్టవంతుల కొరకై ప్రజలందరును పాటుపడి, కష్టముల ననుభవింపవలెననుట అన్యాయము. ప్రభుత్వమునకు పెట్టుబడిదారులపై గల నమ్మకము, సామాన్య ప్రజలపై లేదు. ద్రవ్యోల్బణ నిరోధమునకై ప్రభుత్వము నియమించిన సంఘములో 28 మంది పెట్టుబడిదారులు— 5 గురు కార్మిక ప్రతినిధులు. ఉత్పత్తి ఎక్కువ చేయవలసినది సామాన్య ప్రజలు. కాని సామాన్య ప్రజలకు ప్రభుత్వ మొనర్చుచున్న సౌకర్యము లేమి? సౌకర్యములన్నియు కలవారికే దక్కుచున్నవి. దేశాభివృద్ధికొరకు, శాంతి భద్రతల కొరకు ప్రభుత్వముతో సహకరింపవలసిన సామాన్య ప్రజానీకము యెడ ప్రభుత్వము చూపుచున్న ఆదరణ ఇంత అధ్వాన్నముగా నున్నది. ఇటువంటి అప్పుడు ప్రజలెట్లు సహకరింప గలుగుదురు? సమ్మెలు చేయకుండగా ఉండ గలుగుట సాధ్యమా? పెట్టుబడి, ఉత్పత్తి, పంపకములపై ప్రభుత్వమే ఏల బాధ్యత వహింపరాదు? తన శ్రమ యొక్క సత్ఫలితములు పెట్టుబడిదారు పాలు కాకున్నచో, పంపకము సక్రమముగా జరిగినచో, ప్రతిమనిషి ప్రభుత్వముతో సహకరించగలడు. శాంతిభద్రతలకై ఏలెడు త్యాగము చేయగలడు. ప్రభుత్వముపై భక్తితో అనేక సౌకర్యములను వదలివేయగలడు.

కాని, ఒక చెంప పెరుగుచున్న ధరల నరికట్టలేక, ప్రజలు దేశభక్తిని ప్రదర్శింపవలెనని కోరుట హాస్యాస్పదము. 'దేశాభివృద్ధికై సామాన్యుడు చేయుచున్న కృషిని, పెట్టుబడిదారులు వినియోగించుకొనుచుండగా ఊరకొనుచూ, ఐకమత్యముతో నుండుడని బోధించుట అసమంజసము. సంఘములో జరుగుచున్న అక్రమములను విమర్శించి, వీటి నరికట్టుడని ప్రభుత్వమును కోరినపుడు, ప్రభుత్వము శాంతి భద్రతలపేరిట పౌరస్వాతంత్ర్యము నరికట్ట బూనుట శోచనీయము. ఈనాడుకూడా మన కార్మికులకు సామాన్యమానవులకు జీవనభృతి లభించుటలేదు. శాంతి భద్రతలను కాంక్షించువారు ఈ స్థితిని చూసి కలుగుచున్నారా? ఈ స్థితిని మార్చుటకు సోషలిస్టుపార్టీ ప్రయత్నించుచున్నది. కాని పౌరస్వాతంత్ర్యము మృగ్యమైపోవుచున్నందున ఘర్షణ తప్పనట్లున్నది. ప్రజలకంటె, తమకే ఎక్కువ తెలియునని ప్రభుత్వమనుకొనుట ఘర్షణకే దారితీయును. పౌరసత్వముల నరికట్టుటలో చెన్నరాష్ట్రప్రభుత్వమువారు ఆరితేరినట్లున్నారు. హైద్రాబాదు ప్రజాపోరాటములో పాల్గొనినవారిని, రైతులను—వీరు కమ్యూనిస్టులుకారు—అనేకులను ఈ ప్రభుత్వము నిర్బంధములో నుంచినది. పైగా యీ ప్రభుత్వములో అరెస్టులేగాని, విచారణలు లేవు. విన్నపము లసలే పనిచేయవు.

ం ప్రపంచము ప్రస్తుతము రెండు విధములైన అతివాదులచే బాధ పడుచున్నది. ఒకరు వామపక్షీయులు, రెండు కమ్యూనిస్టులు. ఫ్రాంసులో డిగాలీ పక్షీయులు ఫ్రెంచి విప్లవ సత్ఫలితములనే నాశనము చేయ సమకట్టిరి. బర్మా నవస్వాతంత్ర్యమును పూడ్చిపెట్టుటకు బర్మా కమ్యూనిస్టులు పూనుకొనిరి. ఇండోనీసియా కమ్యూనిస్టులు విప్లవమును లేవదీయ అవసరలేదు. కమ్యూనిస్టులు స్థానిక స్థితుల కనుగుణముగా వ్యవహరింపక, రష్యా విదేశ విధానము ననుసరించుటకే తమ విప్లవశక్తులను వినియోగించుచున్నారు. హైదరాబాదు స్వాతంత్ర్య నినాదమును, కమ్యూనిస్టులు సమర్థించిరి. ఇంతకంటె అభివృద్ధి నిరోధకత్వమేమి కలదు! మనకు వామపక్షీయులు, కమ్యూనిస్టులు - ఇరువురునూ ప్రమాదములను తెచ్చువారే. ఇట్టి స్థితిలో, ప్రభుత్వము సహేతుకముగా ప్రవర్తించి, పౌరసత్వములను మన్నించి, సామాన్య ప్రజాజీవితము నుద్ధరించుటకు వలసిన సౌకర్యములను కలుగజేయుట ధర్మము. ప్రభుత్వమునకీ ధర్మబోధ చేయవలసినది ప్రజలు అని శ్రీ అశోక్ మెహతా ఉపన్యసించిరి.

## భారత న్యాయమూర్తి తీర్పు

1 వ పేజీ తరువాయి

ఇట్టి మానసిక స్థితిలో ఉండగా అత్యాచారముల గురించి ప్రచారం విరివిగా వ్యాపించుట సహజం. ఇట్టి ప్రచారం ప్రస్తుత న్యాయ విచారణలో అత్యధికంగా ఉన్నదని జస్టిస్ పాల్ గారు చెప్పిరి.

మిథ్యామాత్రమైన శ్వేతజాతుల ఆధిక్యత పడలిపోయి జపాన్‌వారి చేతులలో సైనికులు అసంఖ్యాకంగా ఖైదీలుగా చిక్కినారు, ఖైదీలపై అత్యాచారములను ప్రచారం శ్వేతజాతి శత్రువుపై ప్రచారం చేసినచో శ్వేతజాతుల ప్రస్తుత ఆగ్రహం తీరగలిగెడిది. యుద్ధనేరాల గురించిన ప్రచారం చేయడానికి రంగాలు వేరే ఉన్నవి. జయం పొందిన దేశాలు ఈ అత్యాచారపరులను పొరపాటున సైనా క్షమించినచో నిందించు వారుంటారు. నేరాలు ప్రస్తుత నిందితులలో ఏ ఒక్కరికి చెందవు. అంతర్జాతీయ జీవనంలో యుద్ధంఅక్రమమనిగాని నేరమనిగాని పరిగణించబడుట లేదు. ఒక ప్రభుత్వం తరఫున యుద్ధాలు జరిపినంత మాత్రానవ్యక్తులపై ఈ నేరంమోపజాలరు.

ప్రభుత్వాలుగాని వ్యక్తులుగాని చేయు కార్యములకై శిక్షించుటకు గాని ఖండించుటకుగాని న్యాయవిచారణ అంతర్జాతీయ జీవనంలో ఇంకనూ ఏర్పడలేదు.

బర్మా-సయాం రైల్వే నిర్మాణంలో అత్యాచారాల నేరాన్ని వీరిలో ఏ ఒక్క వ్యక్తిపైనా ఆరోపించజాలరని జస్టిస్ పాల్ చెప్పిరి.

యుద్ధమును అతిక్రూరముగా నిర్వహించవలెనని ప్రస్తుత నిందితులలో ఏ ఒక్కరూ కోరినట్లు బుజువుకాలేదని జస్టిస్ పాల్ చెప్పిరి. వారు క్రౌర్యం అవలంబించదలచినట్లయినా లేదు. క్రౌర్య మెక్కడనైనా వున్నచో అది ఏటం బాంబును ప్రయోగించవలెనని మిత్రరాజ్యాలు చేసిన నిర్ణయంలో వున్నది. ఇట్టి ఘోరకృత్యంగురించి భవిష్యత్తే నిర్ణయించగలదు.

విజయంపొందుటకు మారణహోమం చేసి ఒకదేశం యావత్తునూ ఒక్కసారిగా లొంగదీసిన ఈ కార్యం సక్రమం కాగలదేమో చరిత్రయే నిర్ణయించగలదని జస్టిస్ పాల్ చెప్పిరి.

## సంస్థానకాంగ్రెస్‌లో ప్రాథమిక సభ్యులచేర్పించు కార్యక్రమం వాయిదా

### స్వామి రామానందతీర్థగారి ప్రకటన

హైదరాబాద్ నవంబరు 12: హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ సంఘంలో ప్రాథమికసభ్యులను చేర్పించు కార్యక్రమం, లోగడ నిర్ణయించబడినట్లుగా యీనెల 19న ప్రారంభింపబడక, వాయిదా వేయబడినది. సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు ఒక ప్రకటన చేయుచు, కొన్ని మూల సమస్యల దృష్ట్యా అఖిల హైదరాబాదు కాంగ్రెస్ సంఘ సమావేశం ముగియునంతవరకు అనగా డిసెంబరు 2వరకు కాంగ్రెస్ ప్రాథమిక సభ్యత్వ ఫారములను విడుదల చేయవద్దని తానే సంస్థాన కాంగ్రెస్ కార్యాలయమునకు ఆదేశించినట్లు తెలియజేసిరి.

ప్రాథమిక సభ్యులను చేర్పించు కార్యక్రమం వాయిదా వేయుటకు గల కారణములను వివరించుచు రామానంద తీర్థగారు, సంస్థాన కాంగ్రెస్ నిబంధనావళి గత సంవత్సరం ఆమోదింపబడినప్పటి నుండి సంస్థాన ప్రజలలోను, కాంగ్రెస్ సంఘంలోను గొప్పమార్పు కలిగినదనీ, ప్రథమంలో భావించినప్పటికంటె పెద్దపెద్ద సమస్యలు ఉత్పన్నమైనవనీ అందుచే, కాంగ్రెస్ నిబంధనావళిలోని కొన్ని మూలసూత్రములను గురించి అఖిల హైదరాబాదు కాంగ్రెస్ సంఘం పునర్విచారణ జరుపవలసి యున్నదని చెప్పిరి.

### సంస్థానకాంగ్రెస్ కార్యదర్శి ప్రకటన

హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్‌లోని వివిధ గ్రూపులమధ్య ఉన్న విభేదాలను పరిష్కరించుటకుగాను ఢిల్లీలో ప్రయత్నం జరుగగలదని ప్రచారం చేయబడిన వార్త సత్యముతో కూడుకున్నది కాదని సంస్థాన కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి జె. ప్రాణేశాచార్య నేడొక ప్రకటనచేసెను. స్వామీ రామానందతీర్థగారు, నెహ్రూగారు, తదితర భారత నాయకులను దర్శించి హైదరాబాద్ పరిస్థితులను వారికి ఎరిగించుటకే ఢిల్లీ వెళ్లుచున్నారని ప్రాణేశాచార్య చెప్పెను.

### మిలిటరీగవర్నరు పర్యటన

హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్‌జనరల్ చౌధరీగారు, మిలిటరీ ప్రధాన కార్యదర్శి ఎల్. సి. జైన్‌గారితో కలిసి సంస్థానంలోని ఉత్తరజిల్లాలలో పర్యటించుటకుగాను నేడు బయలుదేర వెళ్లుచున్నారు. కొంతమంది పత్రికా విలేఖరులుకూడ చౌధరీగారివెంట వెళ్లెదరు.

### ఎన్నికల కమిషనరు పర్యటన

హైదరాబాద్ ఎన్నికల కమిషనరు ఎం. శేషాద్రిగారు రాజ్యాంగ పరిషత్తు ఎన్నికల సందర్భంలో జరుపవలసిన ప్రాథమిక కార్య కలాపములను పరిశీలించుటకు గాను సంస్థాన జిల్లాలలో పర్యటించుట ప్రారంభించినారు. గతసోమవారం మెదక్ జిల్లాలో పర్యటించి హైదరాబాద్ వచ్చి, తిరిగి మహబూబ్‌నగర్ జిల్లాలో పర్యటించుటకుగాను నేడు బయలుదేరి వెళ్లిరి. మెదక్ జిల్లా పర్యటన సందర్భంలో శేషాద్రిగారు కన్నడంలోను, తెలుగులోను ప్రసంగించుచు, వయోజనులందరు తమ పేర్లు యితర వివరాలు ఓటర్ల చిత్తు జాబితాలో నమోదు అగునట్లు జాగ్రత్త తీసుకొనవలసిందని చెప్పినట్లు తెలియుచున్నది. గ్రామాధికార్లను కలుసుకొని వారు తయారు చేయుచున్న ఇండ్ల జాబితాలను పరిశీలించి, వారికి గల సందేహములను నివృత్తి చేసినారు.

### ఉర్దూ ప్రతిఘటన ఉద్యమం

సంస్థానంలో ఉర్దూ రాజభాషగా ఉండరాదని సాగింప బడుచున్న ఉర్దూ ప్రతిఘటనోద్యమం వృద్ధి నొందుచున్నది. సంస్థానంలోని అధికసంఖ్యాకులు యింకా ఉర్దూను తమ నెత్తిమీద రుద్దుటను సహింపమని ప్రతిఘటన ప్రారంభించినారని తెలియుచున్నది. భాషా విషయాన్ని సరించి జోక్యం చేసుకొనుట ప్రస్తుతపరిస్థితులలో భావ్యం కాదని మిలిటరీ ప్రభుత్వం తలంచుచున్నట్లు కనుపించుచున్నది. రాజ్యాంగ పరిషత్తే యీ విషయమును నిర్ణయించుట సబబని అధికారులు భావించుచున్నారు. ఈ సమస్య పరిష్కరింపబడునంతవరకు ప్రభుత్వ వ్యవహారములు జరుపుటలో ఇంగ్లీషుభాష ప్రోత్సహింపబడ గలదని కూడ తెలియుచున్నది.

### సంస్థానం బయటిసంస్థలకు నిజాం ధన సహాయం

సంస్థానం బయటిసంస్థలకు నిజాం ప్రభుత్వం యిచ్చుచున్న విరాళముల పద్దులు ప్రస్తుతం సవరింపబడుచున్నవి. ఇరాక్ ఈజిప్టులలోని, మత సంస్థలకు, 6 లక్షల రూపాయలు, విజ్ఞానిక సంస్థలకు 6 లక్షల రూపాయలు నిజాం ప్రభుత్వం ధనసహాయం చేయుచున్నది. ఈ సవరణ విధానమును వివరించుచు యీ పద్దులు పూర్తిగా రద్దుచేయబడుట జరుగదని అధికార ప్రతినిధి ఒకడు చెప్పెను. అర్హతగల సంస్థలకు యివ్వబడుచున్న ధనసహాయం కొనసాగింపబడగలదు. పోతే ఏ పనికైతే కొన్ని సంస్థలకు విరాళమివ్వబడుచున్నదో ఆ సంస్థలు ఆపనిని నిర్వహించుచున్నవో లేక ప్రయోజనములేని పనులకు వెచ్చించుచున్నవా అను విషయం పరిశీలన చేయుట జరుగగలదట. హిందూదేశంలోని అలీఘర్, కాశీ విశ్వవిద్యాలయాలు, శాంతినికేతనంకూడ నిజాం ప్రభుత్వంనుండి విరాళములు పొందుచున్నవి.

'మన్‌సాబ్' లు యిచ్చు పద్ధతికూడ సవరింపబడగలదని తెలియుచున్నది.

### హైదరాబాద్ నూతన బడ్జెటు

హైదరాబాద్ నూతన బడ్జెటు మిలిటరీ ప్రభుత్వమునకు సమర్పించబడుచున్నదనీ, యీనెలాంతంలోగా ప్రకటింపబడగలదనీ అధికార ప్రతినిధి ఒకడు నేడు చెప్పెను.

### విదేశాలలోని సంస్థాన విద్యార్థులకు సౌకర్యాలు

విదేశాలలో విద్య నభ్యసించుచున్న హైదరాబాద్ విద్యార్థుల అవసరములు తీర్చుటకుగాను లండన్‌లోని ఇండియా హైకమీషనరుకు తగినంత ధనము పంపుటకు మిలిటరీ ప్రభుత్వం అవసరమగు చర్యలు తీసుకొనుచున్నదని అధికార ప్రతినిధి ఒకడు నేడు చెప్పెను. హైకమీషనరువద్దనుండి జవాబు రాగానే యీధనం పంపబడును.

లండన్‌లోని హైదరాబాద్ ఏజంట్ జనరల్ కార్యాలయం రద్దుచేయబడుచున్నదని కూడ అతడు చెప్పెను. గోవాను కొనుగోలుచేయు విషయమై పోర్చుగీసు ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపవలసిందని హైదరాబాద్ ప్రభుత్వం ఒకబ్రిటిషు వ్యక్తికి 10 వేల రూపాయలు యిచ్చినదని చెప్పబడుచున్న సంగతినిగురించి అడుగగా ఆ మొత్తం ఏవిధంగా ఖర్చుపెట్టబడినదీ వివరములేమీ హైదరాబాద్ ప్రభుత్వమునకుఅందజేయబడలేదనీ, చివరకు ఆపద్దు కొట్టివేయబడినదనీ కూడ అతడు చెప్పెను.

### హైదరాబాదులో కర్ఫ్యూ అమలు

చార్ మినార్ వద్ద జరిగిన చిన్న సంఘటనఫలితంగా హైదరాబాద్‌లో యీనెల 12, 13 తేదీలు రెండురోజుల పాటు కర్ఫ్యూ అమలు జరుపబడెను. పై సంఘటనలో యిద్దరు వ్యక్తులకు స్వల్ప గాయములు తగిలెను. రాత్రి 10 గం. నుండి ఉదయం 6గం. వరకు కర్ఫ్యూ అమలులో నుండును.

చార్ మినార్ వద్ద నేటి సాయంకాలం టాజియా ఊరేగింపు పోవుచుండగా రెండు వ్యతిరేక పక్షముల వారు పరస్పర వ్యతిరేక నినాదములు చేసినసందర్భంలో కొన్ని జరిగినవట. పోలీసులు వెంటనే ఆప్రదేశమునకు వచ్చి పరిస్థితిని అదుపులోకి తీసుకొని వచ్చిరి.

ఈ సంఘటన మినహాగా మొహరం పండుగ 10వ దినం కూడ ప్రశాంతంగా గడచి పోయెను. మొహరం ఉత్సవాలలో నిజాం నవాబు, రాకుమారులు, యితర రాజబంధువులు కూడ పాల్గొనిరి.

### ఏకనాథ్ ఆలయంలో హరిజనుల ప్రవేశం

ఔరంగాబాద్ జిల్లా పైఠాన్‌లో నున్న ఏకనాథ్ దేవాలయంలోకి రామానందతీర్థగారి నాయకత్వాన హరిజనులు ప్రవేశించిరి. ఈ కార్యక్రమం ముగిసిన తర్వాత తీర్థగారు ఔరంగాబాద్ వెళ్లిరి. అక్కడ వారికి లక్షరూపాయలు బహూకరించబడెను. రామానంద తీర్థగారు నేటి రాత్రి బయలుదేరి ఢిల్లీ వెళ్లుచున్నారు.

### కమ్యూనిస్టుపార్టీనుండి రాజీనామా

నారాయణరెడ్డి, మరి 6 గురు గద్వాల కమ్యూనిస్టులు కమ్యూనిస్టు పార్టీ నుండి రాజీనామాచేసి కాంగ్రెస్‌లో చేరుటకు నిర్ణయించిరి.

### మున్షీగారు

బొంబాయి, నవంబరు 11: హైదరాబాద్‌లోని ఇండియా ఏజెంట్ జనరల్ కె. ఎం. మున్షీగారు రాజ్యాంగ పరిషత్తు సమావేశానికి హాజరగుటకు గాను యీనెల 19వ విమానంలో ఢిల్లీ వెళ్లెదరు. రాజ్యాంగ ముసాయిదాను తయారు చేయుటకు గాను రాజ్యాంగ పరిషత్తు నియమించిన ఉపసంఘంలో మున్షీగారు కూడ ఒక సభ్యుడు.

## జపాన్ చక్రవర్తిపై విచారణ జరపాలి

1 వ పేజీ తరువాయి

జపాన్‌కు పట్టుపడిన యుద్ధఖైదీలలో 100కి 27 గురు చనిపోవుటం జరిగినదని ఉదహరించబడినది.

ఈక్రిందివారికి ఈక్రింది నేరాలకు మరణదండన విధించబడెను:

(1) టోజో (64) ప్రధాన యుద్ధప్రోత్సాహకుడు; అంతర్జాతీయ ధర్మసూత్రాలను ఉల్లంఘించుట.

(2) కోకీహిరోటా (70) యుద్ధప్రోత్సాహం, అత్యాచారాలు.

(3) కిమూరా (60) బర్మాలో జపాన్ సర్వసేనాని; యుద్ధప్రోత్సాహం, అత్యాచారాలు.

(4) మట్సూయీ (70) 1937 లో నాన్కింగ్ అత్యాచారాలు.

(5) ముటో (56) ఫిలిప్పైన్స్‌లో జపాన్ సేనాని; యుద్ధ ప్రోత్సాహం; అత్యాచారాలు.

(6) డాయిహారా (65) సింగపూర్‌లో సేనాని; అత్యాచారాలు, యుద్ధప్రోత్సాహం, అంతర్జాతీయ నియమాల ఉల్లంఘనం.

(7) ఇటగాకి- సింగపూర్‌లో 1945 లో సేనాని, యుద్ధప్రోత్సాహం, అత్యాచారాలు, అంతర్జాతీయ నియమాల ఉల్లంఘనం

టోజో సలహాదారుడు సుజుకీ మొదలైన 16 మందికి యావజ్జీవ కారాగార శిక్ష విధించబడినది. టోజో ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా ఉన్న షిగెనోరీటోగోకు 20 సం॥లు జపాన్ రాజకీయవేత్త మామోరు షిగెమిట్సూకు 7 సం॥లు శిక్ష విధించబడినది.

### జపాను యుద్ధనేరస్థుల శిక్షలపై అంతిమ నిర్ణయము

టోక్యో, నవంబరు 13: మాజీ జపాను ప్రధాని హిదేకీ టోజో మొదలుగాగల 25 గురు జపాను యుద్ధనేరస్థుల భవిష్యత్తు, నవంబరు 22 న జనరలు డగ్లస్ మెకార్థర్, మిత్రరాజ్య సైనికశాఖలమధ్య జరుగు సమావేశములో నిర్ణయ మొచేయబడును. బలమైన శిక్షలు కొన్ని అయినను తగ్గించబడవచ్చునని భావించబడుచున్నది.

### "టోజో ఆధ్యాత్మిక మరణం"

టోజో భార్య తాత్వికదృష్టి

టోక్యో, నవంబరు 12: "జపాను ఓడిపోయిననాడే నా భర్త ఆధ్యాత్మికముగా మరణించెను. ఇప్పుడు చావనున్నది టోజో శరీరము మాత్రమే. ఆయన ఉరిశిక్షనే వాంఛించేవని నా నమ్మకము. ఆయన కోరికయే మా కుటుంబములోని వారి కోరిక. మనుష్యుడు ఒక్కసారి మాత్రమే చావగలడు. యుద్ధములో తమ వారిని పోగొట్టుకొన్న అసంఖ్యాక కుటుంబము లుండగా, నేను టోజోపై చెప్పిన తీర్పు ఒక లెక్కలోనిదికాదు," అని హిదేకీ టోజో భార్య కాట్సుకోటోజో చెప్పెను.

### మాంచెస్టరు గార్డియన్ విమర్శ

మాంచెస్టరు, నవంబరు 13: జపాను యుద్ధనేరస్థులను విచారించి శిక్షించిన అంతర్జాతీయ యుద్ధ నేరవిచారణ సంఘము వారి యెదుట జపాను చక్రవర్తికూడా యుద్ధనేరస్థుడుగా విచారించబడవలసినదని మాంచెస్టరుగార్డియను పత్రిక నేడు విమర్శించుచు, విచారణయొక్క ఆశయము కొనసాగలేదని ఉద్ఘాటించెను. "విచారణ సమితి అధ్యక్షుడు సర్ విలియమ్ వెబ్ జపాను చక్రవర్తి ఏలనోను ఎక్కలేదని అడిగెను. ఆప్రశ్నకు సమాధానము, ఆయన ప్రత్యేక ఖోదాకలవాడని ఆ సమాధానము జనరలు మెకార్థరుకు రుచించవచ్చును కాని దానివలన విషఫలితము కలిగినది. విజేతలున్నప్పుడు శాంతిభంగ యత్నములకు—విజేతలు సందర్భములో—ఉరిశిక్ష అను న్యాయసూత్రమువలన ప్రయోజనములేదు. చక్రవర్తి అనుమతిలోనే యుద్ధము జరిగినది. న్యాయముగా ఆయన విచారణ జరుగవలసియుండెను." అని మాంచెస్టరుగార్డియను వ్రాసెను.

---

### శ్రీ మనవాళ రామానుజంగారు

అన్నామలై విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు

మదరాసు, నవంబరు 13: శ్రీయుత మనవాళ రామానుజంగారు, ప్రెసిడెన్సీ కాలేజి ప్రిన్సిపాలు అన్నామలై విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగ ఎం. రత్నస్వామిగారిస్థానే నియమింపబడిరి.

### ఆంధ్రరాష్ట్ర మహిళాసభ

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ మదరాసు శాఖ ప్రథమ వార్షిక సభ 14 తేదీ 3-30 గం. మైలాపూరు ఆంధ్ర మహిళా సభ భవనమునందు జరుగునని లక్ష్మీ రఘురామయ్య, రమాదేవి, కార్యదర్శులు ప్రకటించుచున్నారు.

## హైద్రాబాద్ సైనికబలం తగ్గింపు

హైదరాబాద్, నవంబర్ 11: హైదరాబాద్ సైనికబలమును తగ్గించుట, అన్ని శాఖలతోటి ఒక సైనికోద్యోగ కేంద్రం ఒకటి యిక్కడ ఏర్పాటు చేయబడుటతో జరుగగలదని తెలియుచున్నది. సంస్థాన సైనికబలమును తగ్గించుట అంచెలంచెలుగా జరుగగలదనీ, యిందుకు దాదాపు 6 నెలలు పట్టునని, సంస్థానసైనిక ప్రతినిధిఒకడు నేడు చెప్పెను. ప్రథమంగా పాకిస్థాన్ వాస్తవ్యులను ఉద్యోగమునుండి తొలగించుటను భారత ప్రభుత్వం అంగీకరించినదా అనిఅడుగగా ఆ విషయాన్ని గురించి ఉన్నతోద్యోగులు చర్చ జరుపుచున్నారని అతడు చెప్పెను. హైదరాబాద్ సైన్యంలో పనిచేయుచున్న బ్రిటిషు సైనికోద్యోగులలో చాలమంది వారి దేశమునకు వెళ్లిపోయినారు. మిగిలినవారుకూడ వారి కాంట్రాక్టుల అనంతరం వెళ్లిపోగలరు. బహుకాలంనుండి పని చేయుచు రిటైరగుకాలంలో నున్న వారికి ఉపకారవేతన మొసంగి విడుదల చేయుదురు. హైదరాబాద్ సైనికబలం అన్ని రకముల దళములు కలిసి మొత్తం 10 వేలకు తగ్గించబడును.

### మాంట్‌గోమరీ మంతనములు

బ్రజల్సు, నవంబరు 12: పశ్చిమ రాజ్య కూటమి సర్వసేనాని సంఘ అధ్యక్షులు మార్షల్ వైకౌంట్ మాంట్‌గోమరీ హాలెండ్‌నుండి విమానములో నేడు బ్రజల్సుకు వచ్చిరి. ఇచ్చట నాలుగు దినములు మకాము చేయుదురు. బ్రజల్సు రక్షణాధికారులతో సంప్రదింతురు. రక్షణ మంత్రి కలనల్ షాల్ డ్రెయినర్ గారిని కలసికొందురు. బెల్జియంలోని బ్రిటిష్ రాయబారికి అతిథిగా నున్నారు.

### ఆంగ్లో - అరేబియన్ ఒడంబడిక

డెమాస్కస్, నవంబర్ 12: కైరోలో సమావేశమైన, అరబ్ సమాఖ్య రాజకీయ సంఘము 'ఆంగ్లో-అరేబియన్ ఒడంబడిక' నొకదానిని నెలకొల్పుటకు రాయబారములు జరుపుటకు అనుమతించినది. అమెరికాతోకూడ చర్చలు జరుపుటకు అనుమతించినది. నూనె సరఫరాల విషయమున అరబ్ రాజ్యముల మధ్య ఒక సమైక్య విధాన మేర్పడుటకు కూడ అంగీకరించినది.

### పర్యటనలు

భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ఆంధ్రరాష్ట్రశాఖ ప్రధాన కార్యదర్శి ఎస్. నరసింహారెడ్డి సహాయ కార్యదర్శి ఎస్. తిరుపతిరాయుడుగార్లు ఈ నెల 16, 17, 18, 19, 20 తేదీలలో నెల్లూరు, కర్నూలు, చిత్తూరు, అనంతపురం బళ్లారి జిల్లాలలో కార్మిక సంఘటన సందర్భంగా పర్యటించనున్నారు.

ఉత్తర విశాఖజిల్లా ఇరిగేషన్ సంఘ స్థాయిసమితి కార్యదర్శి రత్నాల రామచంద్రరావుగారు ఈ నవంబరు 23 నుండి 29 వరకు పర్యటనచేసి ప్రాజెక్టుకొన్ని నిర్మాణాలు జరిపి, ప్రాజెక్టు కమిటీలు ఏర్పాటు చేసెదరు.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 13:

వేరుసెనగ: (582 పౌ 1-కి ఎక్సు కోస్తాగిడంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు(పాతది) రు. 149-0-0 150

ఆఫీసువద్ద రు.

వేరుసెనగనూనె: ఎక్సు మిల్లు (టాల్‌కోల్) (సేల్సుటాక్సుతోసహా) రు. 303-0-0 (గ్యారంటీ)

ఆముదం బజారుడెలివరీ ఎక్సుమిల్లర్ రన్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 340-0-0

కొబ్బరినూనె (39 పౌనుల డబ్బా) రు. 32-0-9 32-8-9

బంగారు—వెండి నేటి మధ్యాహ్నం.

1 గంటకు సవరను 1-కి ఎక్సుగ్లు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 76 2-0 మేలిబంగారు తులం 114 0-0 మూసబంగారు 112-8-0. సీమవెండి తులం 100-కి (రెడీ) 177 0 0 వండి తులం 1 13.0.

పంచదార

| | |
|---|---|
| "కాన్పూరు" (2 అంకరు) రు. | 107-8-9 108-8-9 |
| బూరా (25 పౌన్లు) | రు. 11-4-0 |
| కలకండ (25 పౌన్లు) | రు. 15-8-0 |

---

### నోటీసు

గుంటూరు డి॥ మునసబ్ కోర్టులో ఓ. ఎస్. 502/48

వాది: [illegible] అయ్యవార్లు.

4-వ ప్రతివాది: [illegible] నారాయణ.

ఈ దావా నోటీసు వాయిదా 18-11-48 తేదిన జవాబులు తెలుపుకోవలెను. కె. [illegible]రావు, అడ్వొకేటు.

# నెహ్రూ-అబ్దుల్లా ఆటల పోటీలు

అంబాలా, నవంబర్ 12: కాశ్మీరము భారతదేశమునందు చేరిపోయినందులకు సంతోషమును వెలిబుచ్చుచూ, 'జమ్మూ-కాశ్మీర్ స్పోర్ట్సు అసోసియేషన్'వారు భారతదేశమునందు పలుతావుల ఆటల పోటీల నేర్పాటుచేయుచున్నారు.

'నెహ్రూ-అబ్దుల్లా టోర్నమెంట్సు' అనుపేర యీ పందెము లేర్పాటుచేయబడుచున్నవి. హాకీ, ఫుట్‌బాల్, క్రికెట్, వాలీబాల్ వీనిలో పందెము లేర్పాటు చేయబడును. ఈ పోటీలు అంబాలా, అమృతసర్, ఢిల్లీ, సిమ్లా, పూనా, బొంబాయి ఈ 8 తావులయందును యేర్పాటుచేయబడును. నాలుగు విజయచిహ్నములు బహూకరించుట కేర్పాటు చేయబడినది. ఈ విజయచిహ్నములు గెలుపొందినవారివద్ద, తిరిగి పందెము లేర్పాటు చేయువరకూ వుంచుకొనవచ్చును. అటు తరువాత తిరిగి విజయమునందినవారికి ఒసంగబడును.

'అఖిలభారత 'ఒలింపిక్' నిబంధనల ననుసరించి పోటీలు జరుగును. ఇందు అన్ని సైనికశాఖలనుండియునూ, పోలీసు, జాతీయరక్షణసైన్యమూ, రిజర్వు, శాంతిదళములు, కళాశాలలు మొదలగువానినుండియూ ప్రతినిధులు పోటీచేయవచ్చును. ఇతర వివరములు, కార్యదర్శి, జమ్మూ-కాశ్మీర్ స్పోర్ట్సు ఎసోసియేషన్ శ్రీనగర్ అని వ్రాసిన బడయగలరు.

## టెస్టు క్రికెటు

### భారతీయజట్టు 6 గురికి 309

చెన్నపట్నం, నవంబరు 13: ప్రథమ టెస్టు క్రికెటుఆటలో యీ దినం భారతీయులు తమ 1 వ ఇన్నింగు ప్రారంభించి నిన్న సాయంత్రం ముగ్గురిని కోల్పోయి గావించియుండిన 223 పరుగుల మొత్తమును ఫలహారంవేళకు 6 గురికి 309 అగునట్లు మాత్రమే చేయగల్గిరి. ఈ వాళ ఉదయము భారతీయులు విశేషముగా పరుగులు చేయకనే హాజారే అమర్‌నాథ్ ఫడ్కర్ అవుటయినారు. అమరనాథ్ 63 ఫడ్కర్ 41 పరుగులు చేసిరి. అధికారి 32 పరుగులతో ఆడుచున్నాడు.

## సోషలిస్టుపార్టీ వార్షిక సభ

న్యూఢిల్లీ, నవంబరు 12: భారతి సామ్యవాదపక్షం జరిపే మరుసటి వార్షిక సమావేశానికి సుప్రసిద్ధ రచయిత, సామ్యవాదపక్ష స్థాపకులలో ఒకరైన యూసఫ్ మెహెరాలీగారిని అధ్యక్షులుగా సామ్యవాదపక్ష కార్యనిర్వాహకవర్గం ఎన్నుకొన్నది.

ఈ సమావేశం ఫిబ్రవరి 20 నుండి 24 వరకు పాట్నాలో జరుగుతుంది.

గ్లోబ్

## గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్

చెన్నపట్నం నవంబరు 14: గ్రాండు ట్రంక్ ఎక్స్‌ప్రెస్ నవంబరు 15నుండి ఈ క్రింది వేళలకు నడుచునని ఒక ప్రకటన తెలుపుచున్నది. దీని జట్టి మదరాసు బెజవాడల మధ్య నడిచే యితర బండ్ల వేళలు కూడా ఆ తేదీ నుండి మారును

మదరాసు నుండి బయల్దేరు వేళ ఉ. 10-45 గూడూరు మ. 1-18 1-35 నెల్లూరు 2-7 2-9 ఒంగోలు 4-10 4-12 తెనాలి 6-42 6-45 బెజవాడ రాత్రి 7-35 7-55 బాల్హార్షా ఉ 4-35 4-55 ఢిల్లీ మూడోరోజు ఉ. 8-35 ఢిల్లీ బయల్దేరు వేళ సా 6-25 బల్హార్షా ఉ 10 0 10-15, (రెండవరోజు) బెజవాడ ఉ 7-0, 7-20 (మూడోరోజు) తెనాలి 7-56 7-59 ఒంగోలు 9-50 10-5 నెల్లూరు మ 12-5 12-7 గూడూరు 1-10 1-25 మదరాసు సా 4-10 (మూడోరోజు)

## రైళ్ల వేళలు

నవంబరు 1 వ తేదీ నుండి మదరాసు సెంట్రలు స్టేషనులో రైళ్ల రాక పోకలు యీ దిగువరీతి గలవు:

| | రాక | పోక |
|---|---|---|
| బొంబాయి మెయిలు | ఉ 7-55 | 8-35 రా |
| ,, ఎక్స్‌ప్రెస్ | రా 8-10 | 7-10 ఉ |
| కలకత్తా మెయిలు | ఉ 8- 5 | 7-25 రా |
| విశాఖపట్నం ప్యాసింజరు | రా 9-10 | 8-20 ఉ |
| వర్ధా ప్యాసింజరు | ఉ 11-50 | 7-40 రా |
| బెంగుళూరు మెయిలు | ఉ 6-10 | 9- 0 రా |
| ,, ఎక్స్‌ప్రెస్ | సా 3-50 | 12-40 ఉ |
| ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ | ఉ 5-0 | 10 50 రా |
| నీలగిరి ఎక్స్‌ప్రెస్ | ఉ 7-10 | 8- 5 రా |
| మెంగుళూరు ,, | ఉ 7-40 | 7-10 రా |
| కొచిన్ ,, | ఉ 10-30 | 4-35 సా |
| రేణిగుంట ప్యాసింజరు | ఉ 9-48 | 5-30 సా |
| ,, ,, | రా 9-55 | — |
| బెంగుళూరు ,, | రా 8-25 | 6-50 ఉ |
| ,, ,, | ఉ 5-35 | 9-25 రా |
| రాయచూరు ,, | సా 5-50 | 8-50 ఉ |
| జాలార్పేట ,, | మ 1-40 | 12-45 మ |
| ఆర్కోణం ,, | — | 6-25 సా |
| బిట్రగుంట ,, | సా 3-5 | 12-20 మ |



## రాయలసీమ మహాసభ కార్యవర్గం

కూర్చున్నవారు ఎడమనుంచి (1) శ్రీ డి. రామన్నగారు కార్యదర్శి, ఆహ్వాన సంఘం (2) శ్రీ కంచుల ఓబులరెడ్డిగారు, ఆం. రా. కాం. కార్యదర్శి, (3) శ్రీ పప్పూరు రామాచార్యులుగారు, ప్రారంభకులు, (4) శ్రీ యం. కె. వి. రెడ్డిగారు, సభాధ్యక్షులు, (5) శ్రీ కె. వి. వేమారెడ్డిగారు, ఆహ్వాన సంఘాధ్యక్షులు, (6) శ్రీ పి. తిమ్మారెడ్డిగారు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ఉపాధ్యక్షులు.



ఇండియాలో సీలోను రాయబారిగా నియమింపబడిన [illegible] తన యోగ్యతాపత్రమును గవర్నర్ జనరల్ రాజాజీకి సమర్పించుచున్న దృశ్యము.







ఈ నెల 8, 9 తేదీలలో మచిలీపట్నంలో 16 దుక్కులవర్షం కురిసినది. పట్టణంలోని రోడ్లన్నియు జలమయమై పోయినవి.

# ద. ఆఫ్రికా యునైటెడ్ పార్టీ నిర్ణయంపై

## నేటాల్ కాంగ్రెస్ ఖండన

దర్బాన్, నవంబరు 11: దక్షిణఆఫ్రికాలోని భారతీయులను ఇండియాకు తిప్పి పంపివేయవలెనని యునైటెడ్ పార్టీ కావించిన నిర్ణయమును అధిక్షేపించుచూ, నేటాల్ భారతీయ కాంగ్రెస్ నేడీ ప్రకటన కావించెను: "నేషనలిస్టు ప్రభుత్వం ప్రజాస్వామ్య ప్రతికూలవిధానాన్ని అనుసరించుచున్నదనీ, ఇది దక్షిణాఫ్రికాకు చాలా ప్రమాదకరంగా పరిణమించగలదనీ, జనరల్ స్మట్సు హెచ్చరిక చేసిన కొద్ది రోజులకే, నేటాల్ రాష్ట్రి యునైటెడ్ పార్టీ ఈ నిర్ణయమును కావించుట మిక్కిలి శోచనీయము. నేషనలిస్టు పక్షపు విధానానికి యునైటెడ్ పక్షపు విధానానికీ వ్యత్యాసం ఇసుమంతైనా లేదని, దీనివల్ల తేలిపోయినది. నేషనలిస్టు పార్టీతో రాజీచేసుకొని యునైటెడ్ పార్టీ తనకు తానే గోయిని తవ్వుకుంటున్నది. యునైటెడ్ పార్టీ నిర్ణయం ఫాసిస్టు వ్యతిరేకులకు నిరుత్సాహము కల్గించకమానదు."

# స్మట్స్ ప్రసంగంపై మలన్ విమర్శ

జోహానిస్‌బర్గ్, నవంబర్ 12: దక్షిణాఫ్రికా ప్రస్తుత ప్రధాని డా॥ మలన్ ప్రభుత్వం దక్షిణాఫ్రికాలోని యూరపియనేతరులకు గల కొద్ది హక్కులనుకూడా తొలగించివేస్తున్నదని మాజీప్రధాని జనరల్ స్మట్స్ ఈమధ్య ఒక ప్రసంగమును చేయగా, ధర్మక ర్తృత్వ సంఘంలో భారత ప్రతినిధి శ్రీమతి విజయలక్ష్మి ఆ ప్రసంగాన్ని ఉదహరించి దక్షిణాఫ్రికాను విమర్శించినది. ఈ అంశముపై వ్యాఖ్యానించమని దక్షిణాఫ్రికా పత్రిక 'డీట్రాన్స్‌ఫాలర్' ప్రశ్నించగా, స్మట్స్ ప్రసంగం దక్షిణాఫ్రికాకు చేసిన హానిని వర్ణించుటకు మాటలు చాలదని డా॥ మలన్ ఈ వేళ అన్నాడు.

"పార్టీ రాజకీయాలలో కలిగిన ఆశాభంగాన్నీ, కోపాన్నీ పురస్కరించుకుని ఎవ్వరూ ఇంతమితిమీరి ప్రసంగించటానికి సాహసించరు. అంతరంగిక వివాదాలు ఏవైనా ఉన్నప్పటికీ, ఆత్మగౌరవం కల దేశమేదీ విదేశాలజోక్యాన్ని ఆహ్వానించదు. ఆ విధంగా ఎవరైనా చేస్తే అది ద్రోహంగా పరిగణింపబడుతుంది. దక్షిణాఫ్రికా పట్ల ఇప్పటికే ప్రపంచంలో అకారణ విద్వేషమెంతున్నదో అందరికన్న స్మట్స్‌కు ఎక్కువ తెలుసు" అని మలన్ వ్యాఖ్యానించెను.

### స్మట్సు జవాబు

ఐక్యరాజ్యసమితికి దక్షిణాఫ్రికా ప్రతినిధివర్గంగా వెళ్లిన వారికి వ్యతిరేకంగాపనిచేస్తూ విదేశాలలో దక్షిణాఫ్రికా ప్రతిష్ఠను తొలగునుంట కలుపుతున్నట్లు ప్రధాని మలన్ చేసిన ఆరోపణలను ఖండిస్తూ జనరల్ స్మట్సు నేడొక ప్రకటన చేసెను. తాను దక్షిణాఫ్రికా అంతరంగిక వ్యవహారములను మాత్రమే తన ప్రసంగములో ప్రస్తావించితినని స్మట్సు తెలియజేసెను. అంతరంగిక వ్యవహారములను ప్రజలకు తెలియజెప్పుట ప్రతిపక్షనాయకుని విధి అని స్మట్సు చెప్పెను.

### భారత మితవాదుల విజ్ఞప్తి

మితవాదులసంస్థ అయిన దక్షిణాఫ్రికా భారతీయసంస్థ ఈ వేళ దర్బాన్‌లో దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ మలన్‌ను కలుసుకుని దక్షిణాఫ్రికా మంత్రులు భారతీయులను విమర్శించకుండా కాపాడవలెనని విజ్ఞప్తి చేసుకున్నది.

టి. ఎస్. వెంకట్రామనుగారు, అనంతపూరు ఇంజనీరింగు కాలేజి ప్రొఫెసరుగ నియమింపబడిరి.

# ఇండియా గవర్నమెంటు

## విస్కోస్ బ్రైట్ ఆర్టిఫిషల్ సిల్కు యారన్ అమ్మకము

ఇటీవల జపానునుండి దిగుమతిచేయబడి బొంబాయిలోని ఇండియా గవర్నమెంటువారి టెక్స్‌టయిల్ కమీషనరువద్ద నున్న దిగువ వివరములు గల విస్కోస్ బ్రైట్ ఆర్టిఫిషల్ సిల్కు యారన్ 150 డెనీర్ కొని తీసుకొనిపోవుటకు నిర్ణీతఫారములలో ఆఫరులు కోరబడుచున్నవి.

| స్టోరుల వివరము | మొత్తము | రిజర్వు ధర |
|---|---|---|
| విస్కోస్ బ్రైట్ జపానీస్ ఆర్టిఫిషల్ సిల్కు యారన్ 150 డెనీర్ | 3,11,000 పౌ॥లు. (ఒక్కొకటి 200 పౌ॥లు గల 1,555 కేసులు) | పౌ॥ 1-కి రు. 3/-లు. |

స్థలము: పైన తెలిపిన స్టోరులు, బొంబాయి, కాటన్ గ్రీన్, కాటన్ డిపో, నెం. 2 విస్బ్రయలింగ్ డిపో వద్దనున్నవి.

టెండర్లు తీసుకొనుటకు ఆఖరు గడువు తేది - 6-12-1948 తేది సా. 4 గం. లు.

టెండర్లు బహిరంగంగా తెరచుట - 7-12-1948 ఉ. 11 గం. లు.

ఆఫరులు తెరచి యుంచబడు గడువు. 5 1-1949.

పైన తెలిపిన రిజర్వు ధరకు తక్కువ టెండర్లు విచారింపబడవు.

టెండర్లు 100 కేసులకు (20,000 పౌ॥లు) తక్కువ కాని మొత్తములకు పంపవలెను.

ఆఫరుచేసిన మొత్తము ధరలో 10% సొమ్ము బొంబాయిలోని ఇండియా గవర్నమెంటు టెక్స్‌టయిల్ కమిషనరుగారి పేర "రివిన్యూ డిపాజిట్" క్రింద రిజర్వు బ్యాంకు లేదా ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియాలో గాని గవర్నమెంటు ట్రెజరిలో గాని చెల్లించి సదరు రశీదును టెండర్లతో జతపరిచి పంపవలెను. నగదు గానిఇతర బ్యాంకుల మీద డ్రాఫ్టులు గాని, చెక్కులు గాని, పంపినచో అవి అంగీకరింపబడక పోవుటే కాక టెండర్లు నిరాకరింపబడును.

స్టోరులను తనిఖీచేసుకొనుటకు పర్మిట్లు, స్టోరులను గురించిన మిగతా వివరములు, బొంబాయి CYC-9 సెక్షనులోని ఇండియా గవర్నమెంటువారి టెక్స్‌టయిల్ కమీషనరుగారివద్ద నుండి పొందవచ్చును.

అమ్మకములు సదరు స్థలమువద్దనే జరుగును. స్టోరులు మిగిలియున్న యెడలను, "Con. 117"లోని అమ్మకపు సాధారణ షరతులకు లోబడియును అమ్మకములు జరుగును.

టెండర్లను డబుల్ కవర్లలో సీలుచేసి, రెండు కవర్లమీదను టెండరు నెం. "CYC9/D/Art Silk Yarn" అని సూపర్‌స్క్రయిబ్ చేసి, బొంబాయి, బెల్లార్డు ఎస్టేటు, CYC9 సెక్షనులోని ఇండియా గవర్నమెంటువారి టెక్స్‌టయిల్ కమీషనరు గారికి పంపవలెను. సెట్టు 1-కి రు. 5/-లవంతున చెల్లించి బొంబాయిలోని టెక్స్‌టయిల్ కమీషనరుగారివద్ద నుండి టెండరు ఫారములు పొందవచ్చును. ఈ సొమ్ము వాపసుచేయబడదు.

ప్రకటించినది:

టెక్స్‌టయిల్ కమిషనర్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, బల్లార్డు ఎస్టేట్, బొంబాయి.

A. C. 460



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.